# ఇష్టాగోష్ఠి

## ప్రసంగాలు





పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు, ఎం. ఏ.,



శారదా పీఠము : గుంటూరు

ప్రథమ ముద్రణం : మే 1956

దుర్ముఖి : వైశాఖం



# ఒక రూపాయి



: ప్రతులకు :

సాహిత్యాచార్య, ఆంధ్ర ఆర్యాల్లు

శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావు, ఎం. ఏ.,

ఆంధ్రోపన్యాసకులు : హిందూ కళాశాల

శారదాపీఠము : పట్టాభిపురము : గుంటూరు





కీ॥ శే॥

పిల్లలమఱ్ఱి

సూర్యనారాయణసూరి



సాహిత్యాచార్య

శ్రీ పిల్లలమఱ్ఱి ఎం. ఏ.,





# వక్తవ్యం

ఇందులోని ప్రసంగవ్యాసాలన్నీ ప్రజాజీవితానికి సన్నిహితాలైన వివిధవిషయాలకు చెందినవి. పదిహేనేళ్ల యీమధ్య నేను వీనిని వ్రాసి వివిధపత్రికలలో ప్రచురించినాను.

నన్ను పాత్రికేయునిగా (జర్నలిష్టుగా) ప్రోత్సహించిన సన్నివేశాలను సంస్థలను స్మరించకుండా ఉండలేను.

విద్యార్థిదశలో (1936-40) సికిందాబాదులో సాధన సమితీయులంసాగించిన "ప్రత్యూష" పత్రికకూ, ప్రచురణలకూ సంపాదకత్వం- హైదరాబాదులో ఉద్యోగరీత్యా ఉన్నపుడు (1943) సంక్రమించిన "హైదరాబాదు సమాచారం" సంపాదకత్వం- గుంటూరులో మా "హిందూకళాశాలా పత్రికా" సంపాదకత్వం (కొన్నియేళ్ళలో) - "సంస్కృతసమ్మేళన సంచికా" సంయుక్తసంపాదకత్వం నాలోని నూతనశక్తిని వెలికి దెచ్చినవి. అన్నిటి కన్నా ముఖ్యమైంది గుంటూరులో జ్యోత్స్నా సమితీయులం కొందరం 1947, 1948 లలో నిర్వహించిన-"ఆంధ్ర రిపబ్లిక్" అనే వారపత్రికకు సహాయ సంపాదకత్వం వహించి నేను చేసిన కృషి! పై సందర్భాలన్నిటా నాకు తోడ్పడిన మిత్రులకు కృతజ్ఞుణ్ణి.

ఛలోక్తులతో నర్మభాషణంతో, ఇష్టాగోష్ఠి జరపడంలో పేరుపొందిన లోకజ్ఞులు, వైదికోత్తములు, మత్పితామహులు 'సూర్యనారాయణసూరి'వరులకు భక్తితో దీన్ని అంకితం కావిస్తున్నాను.

12-5-1956 — పిల్లలమర్రి

# ఇష్టాగోష్ఠి

## పిల్లలమర్రి ప్రసంగాలు



★

# అక్టోబరు ఒకటి

ఇవ్వాళ తెలుగు వాళ్ళందరికీ పండుగ! అయితే ఈ పండుగదినం ప్రాప్తింపచేసిన వాళ్ళెవరు? ఈ శుభదినం కోసం ఎన్నెన్ని విధాలుగా ఎందరెందరు కృషి చేశారు? శారీరకంగా, మానసికంగా, ఎన్నెన్ని వేదనలను ఆంధ్ర సోదర సోదరీ మణులు పొందారు? ఎందరు మేధావులు తమ బుద్ధిబలంతో రాష్ట్రోద్యమాన్ని నడిపినారు? ఎందరెందరు తెలుగు బిడ్డలు యీ పుణ్యభూమిపై కర్తవ్య పరాయణులై అసువులను బాసినారు? అవును—ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానాన్ని పరికిస్తే తప్పకుండా మన శరీరాలు గగుర్పొడుస్తవి! ఒక్క సారిగా ఆశ్చర్య చకితులం అవుతాం! అప్రయత్నంగానే కళ్ళు చమరుస్తాయి! గాద్గదికమూ ఒడముతుంది! ఈ శుభదినం వెనుక ఎంత చరిత్రవుంది! ఎంత చైతన్యముంది! ఎందరి పవిత్రాత్మజ్యోతులు ప్రకాశిస్తున్నవి! ఆంధ్ర మాతృ ఋణాన్ని తీర్చుకొన్న మహనీయులు కారా వారంతా! ఈ పవిత్ర ముహూర్తాన వాళ్ళందరికీ జేజేలు పెట్టుదాం!!

నలభై ఏళ్ళ ఉద్యమం – ఆంధ్రోద్యమం. స్వస్థాన వేష భాషాభిమానాలు ప్రోదికొనాలి అని ఏనాడో ఆదికవి నన్నయ పలికినాడు; ప్రబోధించినాడుకూడ! దేశ స్వాతంత్ర్యోద్యమంతో పాటుగా ప్రాంతీయ పరిపాలనము ప్రాంతీయ భాషలలో జరుపుకొనటం లోగల సౌలభ్యాన్నీ, సౌకర్యాన్నీ నాయకులు గుర్తించే వచ్చినారు. ఆదర్శాల కేవిధంగాను భారత దేశం తీసిపోదు. కాని ఆచరణలో పెట్టడములో విశ్వసించిన ఆదర్శాలకే తావులేకుండా పోవడం అబ్బురం కల్గి

గిస్తుంది. ఉద్యమం నడిపేటప్పుడున్న దీక్ష, అంతశ్శుద్ధి, ధర్మ పరాయణత్వము, త్యాగశీలము, జాతీయులకు ఏతదుద్యమం ఫలించినతర్వాత నిర్వహణములో ఆయాగుణాలు లుప్తమై పోవడం వింత గూరుస్తుంది. స్వాతంత్ర్యోద్యమం ఈ సిద్ధాంతానికి తార్కాణము. నా దేశము, నాజాతి అనే అభినివేశములో, "నా దేశస్వాతంత్ర్యంకోసం నా సర్వస్వాన్నీ త్యాగంచేస్తాను, రక్తం ధారవోస్తాను, పారతంత్ర్యం పోనాడడానికి ఎంతటి కార్యక్రమాన్నైనా అనుసరిస్తాను" అని ఆవేశంతో శపథం తీసుకున్న జాతీయులు అంతగాను పోరాడారు. అసదృశమైన నష్టకష్టాలకు గురై త్యాగాన్ని ప్రకటించారు. కాని నిర్వహణ కేవలం ఇంకా అబ్బిందికాదు. తాము చేసిన త్యాగాలకు ప్రతిఫలం ఆశించడం భారతీయ ధర్మంకాదు. నిష్కామకర్మయే మనధర్మం! అయినా త్యాగానికి విలువ కట్టగలమా? స్వాతంత్ర్యము లభించిన తర్వాత దేశీయులలో ఎందుచేతనో అలసత్వం పర్విండి. ఔదాసీన్యం హెచ్చింది. బాధ్యతలను గుర్తించక హక్కులకోసం పోరాటము జరపడం జనులు తమకర్తవ్యంగా గ్రహించడం పొరపాటే అవుతున్నది. నా దేశం నా సోదరులు, నా ప్రభుత్వం అనే అభినివేశము వ్యాప్తిచెందడం లేదు. ప్రజలు వేరు, ప్రతినిధులు వేరు, ప్రభుత్వము వేరు అన్న సరణి అగుపిస్తూ వుండడమున్నూ దురదృష్టకరముగాదా! ప్రభుత్వాన్ని ముందు ప్రజలర్థం చేసుకోవాలి. అందులో లోటుపాటులను ధైర్యంగా చూపెట్టి, నచ్చచెప్పి, వాటిని పరిహరింప జేసుకోవాలి. అంతేగాని ముందు అనుయాయులుగా కన్పిస్తూ, వెనుక పరిహసిస్తూ వెన్నుపోటులు పొడిచే

శీలం దేశీయులకు తగని శీలం. ఏమైనా నా దేశం నా జాతి అని పొంగిపొర్లే ప్రేమహృదయం దేశీయులలో ఇంకా అలవడవలసే వున్నది. మన దేశ స్వాతంత్ర్యాన్ని నిలవరించుకొనేందుకు ప్రతి భారతీయుడూ తన బాధ్యతను గుర్తించి పాటుపడాల్సి ఉంది. ప్రభుత్వము ప్రజలది. బాధ్యతలు ప్రజలవి.

ప్రభుత్వ విధానాన్ని అమలు జరుపవలసినవారు ప్రజలు. ఆందోళన ప్రధాన కర్తవ్యముకాదు. నేడు కావలసినది ఆకళింపు! భారతీయ సంస్కృతీ లక్ష్యం శాంతిసాధనము. అందుకోసం పరస్పర భావాలను సానుభూతితో ప్రజలు గుర్తించడం ఎంతో అవసరం. ఒకరినొకరు సరిగా అర్థం చేసికోలేక పోవడంవల్లను విశ్వాసమును గోల్పోయి అనుమానిస్తూ ఉండడం వల్లనూ వైషమ్యాలు ఉద్బుద్ధమవుతున్నవి. అనుమానశీలాన్ని పెంపొందించుకొని లాభంలేదు. దేశీయులు విశ్వాస శీలాన్ని అభివృద్ధి పరుచుకోవాలి. ఇది ప్రేమ సూత్రం చేత సాధింపతగినది. మానవునికీ మానవునికీ మధ్య ప్రేమ పాశం అతిశయిల్లాలి. ప్రేమచేత సాధింపలేనిది లేదని భారతీయ సిద్ధాంతం!

[ ఆంధ్రదినపత్రిక (1-10-1954) లో ప్రచురింపబడింది. ]

1.

# ఆంధ్రులు
# క్రియాసాధకులు కావాలి

గతంలో మనఆంధ్రజాతి మహారాజ్యాల చరిత్ర కలది. పూర్వం ఒకప్పుడు నాల్గువందల సంవత్సరాలు నిస్తులంగా వైభవోపేతంగా సువిశాల సామ్రాజ్యాన్ని ఏలినజాతి ఆంధ్ర జాతి. ప్రఖ్యాతులైన శాతవాహను లాంధ్రులేనను చారిత్రక సిద్ధాంతాన్ని అందరంగీకరించి తీరాలి. శాతవాహనులనుంచీ ఆంధ్రుల ప్రజ్ఞావిశేషాల్ని అవలోకిస్తే ఇలాంటి జాతి మరొకటి లేదనిపిస్తుంది. ఆంధ్రులు విశిష్టమైన గుణసంపద కలవాళ్ళు. మాటమర్యాదల్లో, ధైర్యసాహసాల్లో, సహన ఔదార్యాల్లో ఉత్సాహోదరణాల్లో అసదృశమైన పార్థక్యం కలవాళ్ళు. ఆంధ్ర భాష అందాల పందెములు పోయేటటువంటిది. అనేక భాషా వేత్తల మెప్పులుపొంది మాధుర్యానికి పెట్టింది పేరనిపించు కొన్నది. లలిత కళల్లో ఆంధ్రప్రతిభ అసదృశమైంది. ఆర్ష సంప్రదాయ పాండిత్యాలలో అంధ్రులదే అగ్రస్థానం. విజ్ఞా నంలో వ్యాపారంలోను మనవారెందునా తీసిపోరు. ఆంధ్ర జాతికి సాంప్రదాయము పవిత్రమైంది. శాస్త్రప్రామాణ్యము, వేదప్రామాణ్యము, గోపావిత్ర్యము, విగ్రహారాధనము—వీటి యందాంధ్ర జాతికున్న అభినివేశం మిక్కుటమైంది. సంస్కృత పదాల్ని ఉచ్చరించడంలో ఆంధ్రునికున్న గురుత్వము గుర్తిం చారు పెద్దలనేకులు. ఇలా పాలక ప్రవృత్తికికావలసిన గుణ గణాలన్నీ ఆంధ్రజాతీయుల కున్నవి!

ఇక ఆంధ్రదేశ సౌభాగ్యాన్ని చూడ్డండి. పాడిపంటలా సమృద్ధంగా ఉన్నవి. ప్రకృతి శోభకు కొదువలేదు. ఎక్కడ చూచినా పచ్చని పొలాలు! బారులు తీర్చిన పర్వత శ్రేణులు- గలగలలాడే ప్రవాహాలు! ఇంటింటా పశుసంపద - గోమాత సాక్షాత్కారం! చిన్నచిన్న లేగదూడల చిందులు! వ్యావసాయక జీవితంలోని మాధుర్యమంతా, సౌందర్యమంతా ఒక్కచో రాశీభూతము అయిన విధాన మనగ్రామాలు కన్పిస్తాయి. నాటి గ్రామీణులంతా పరస్పర స్నేహభావంతో మెలగుతూ ఉండడం గమనించతగింది. వర్గవైషమ్యాలెరుగని అమాయకమైన శాంతియుతమైన జీవితం వారిది.అచ్చమైన ఆంధ్రుడు నిష్కపటి; హృదయంలో ఏదీ దాచుకోలేడు; ఈ అచ్చమైన ఆంధ్రత్వం పాశ్చాత్య నాగరకత పొకనటువంటి మారుమూల గ్రామాల్లో ఈ నాటికీ మనకు కనిపిస్తుంది. దాన్ని పవిత్రంగా భావించి, ప్రాచుర్యం పొందించడంలో మనమెంతైనా పాటుపడాల్సి వుంది. ఒకనాటి ఆంధ్రుని ఔన్నత్యాన్ని విస్మరించరాదు.

ఈనాటి ఆంధ్రుని అధోగతినిగూర్చి విచారించడం మానరాదు. గతకాలము మేలనీ వచ్చుకాలం చచ్చుదనీ చప్పరింపరాదు. ప్రస్తుతావస్థలో ఆంధ్రుల్లో అలసభావం హెచ్చుగా ఆవరించి ఉంది. ఏవిషయంలోనూ సంపూర్ణంగా కలసి రాకపోవడం, అన్నివిషయాల్లోను తాము వున్నామనిపించుకోవడం జరుగుతున్నది. ఆరంభ శూరత్వమే కాక నిర్వహణ సామర్థ్యాన్ని కూడా అలవరచుకోవాల్సిన బాధ్యత ప్రతి ఆంధ్రునిమీద ఉన్నది. "పట్టుపట్టగరాదు.

పట్టువిడువగరాదు," అనే వాక్యాన్ని లక్ష్యముగా ఉంచుకుంటే కొంత మేలు.

ప్రత్యేక జాతిగా ఎన్నదగిన గుణగణాలు, ప్రజ్ఞాపాండిత్యాలు, సాధన సామగ్రీ ఉన్నటువంటి మనజాతికి అన్యాయం జరుగనీయకుండా చూచుకోవాలి. దీనికి 'బాలనాయకం బహునాయకం' పనికిరాదు. "ఎవరికివారే యమునాతీరే" అన్నట్లు నలుగురూ నాల్గుమార్గా లవలంబిస్తే ప్రయోజనం శూన్యం. జాతీయులంతా ఏకంకావాలి. ఆంధ్ర జాతీయాభ్యుదయమనే ఏకైక లక్ష్యసాధన నిమిత్తం ఏకాగ్రతతోనూ చిత్తశుద్ధితోను తీవ్రంగా కృషిచేయాలి. 'ఆంధ్రానా మనేకత్వం' అనే ప్రథను రూపుమాపుకో యత్నించాలి. తోటివానిలో లోపాల్ని ఏర డంకన్నా ముందు తన్నుతాను శోధించుకోవాలి. తన లోపాల్ని తొలగించుకోవాలి. అహంభావాన్ని అదుపులో ఉంచుకొని ప్రతివ్యక్తి చర్యనూ సానుభూతితో తిలకించడం నేర్చుకోవాలి. నోటితుత్తర తీర్చుకోనే నిమిత్తం, ఉద్వేగంతో ఉపన్యసించటంకంటే శాంతంగాఉండి కార్యసాధనలో ఆశక్తినీ వినియోగించడం లాభదాయక మౌతుంది. వాక్శూరులేకాదు ఆంధ్రులు క్రియాసాధకులనే పేరు తెచ్చుకొనే దీక్ష పూనాలి మనం ఇంకమీద.

ఈనాడున్న వాతావరణం చాల విషమమైంది. ఎవరిని నమ్మడానికీ వీలులేదు. ఎవరి వాక్యాలూ సత్యమైనవి కావు. ఎవరూ నిశ్చలంగా ఒకమాటమీద వుండటంలేదు. సంకుచితపు బుద్ధులు, సంప్రదాయ దూరమైన ప్రవర్తన కలవారు హెచ్చుగా కన్పించుతున్నారు. వర్గవైమనస్యాలు వెల్లువలులా,

రేగుతున్నవి. ద్వైదీభావ మెన్నివిధాలుగా రాపీలున్నదో అన్నివిధాలూ అగుపిస్తున్నాయి. జాతిఅంతా ఛిన్నాభిన్నమై పోవడం ప్రారంభించింది. తన భాష - తన వేషం - తన మతం తనజాతి అనే భావం మాటలో పైకి యెంతగా ప్రకటిస్తున్నా నేటి ఆంధ్రుడు అంతరంగంగా ఆభావానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడు. అంటే తన్నుతానే మోసగించుకోవడం నాగరకతగా బలిసిపోయిన దన్నమాట!

పాశ్చాత్యుల ప్రాబల్యం, ప్రభావమూ ఆంధ్రజాతి మీద ఎంతగాఢంగా వున్నదో చెప్పలేము. ఏకొత్త ఉద్యమం వచ్చినా ప్రథమానుయాయి ఆంధ్రుడు కావలసిందే. ఏ నూతన భావము వచ్చినా దాని నీతడు గ్రహింప వలసిందే. ఇలా నేటి ఆంధ్రుడు ఒకనాటి అచ్చమైన ఆంధ్రునికన్నా ఎంతో భిన్నుడు. ఈనాటి నాగరికాంధ్రుడు ఆంధ్రత్వాన్ని నామ మాత్రంగా నిల్పుకొన్న వాడౌతున్నాడు. ఏవర్గము బలీయంగా ఉన్నదో, ఏవర్గాన్నాశ్రయిస్తే తాము లాభము పొందుతారో ఆముఠాలో చేరడం! ఇలాంటి దృష్టిఉన్నవాడు ప్రత్యేకంగా - వ్యక్తిగతంగా ఆలోచించుచున్నాడే కాని, సమష్టిగా జాతినిగూర్చి పాటుపడడంలేదు. మానవులలో స్వార్థకాంక్ష ఎప్పుడైతే ప్రబలిందో ఆనాడు జాతి ప్రిదిలి పోవడం ప్రారంభించినట్లు గుర్తించవచ్చు. ఈదుస్థితే మన కీనాడు వాటిల్లినది. మనబంగారం మంచిదైతేగా! స్వార్థ పరులు, అధికారప్రియులు మనలో హెచ్చినారు. ఏతత్కారణంగా ఆంధ్రుడితరులతో చేతులు కలిపి తన స్వార్థక్యాన్ని కోల్పోతున్నాడు; ఆంధ్రునికున్న విశాల హృదయము నేడీ

విధముగా పర్యవసిస్తున్నది. దానిని విశాలహృదయమని పైకి చెప్పుకొన్నా జాతికి గొడ్డలిపెట్టయినప్పుడదేవిధంగా శ్రేయోదాయక మైనదౌతుంది? విద్వేషాన్ని నిర్మూలించడం మన ధర్మం. అలాంటప్పుడు ప్రజల్ని వివేకవంతులుగా, విద్యావంతులుగా తయారుచేయవలసి వుంటుంది.

ఈనాడున్న విద్య సదసద్వివేచనా జ్ఞానాన్ని ప్రసాదించేదికాదు. భేదాభిప్రాయాలను హెచ్చుచేయగల సామర్థ్యమీవిధానములో ఉంది. ఇక జాతీయాభ్యుదయమే కేంద్రభావంగా గ్రహించి ఏప్రణాళికనైనా తయారు చేసుకోవాలి.

ఈ నాటికీ ఆంధ్రుల్లో అగ్రశ్రేణికి చెందినవారు, ప్రతిభావంతులు, రాజకీయవేత్తలు, విద్యావేత్తలు లేకపోలేదు. వారందరేకీభవించి ఆంధ్రజాతిని సముద్ధరించడానికి ప్రయత్నించాలి. భారతదేశమును వదలి బ్రిటిషువారు వెళ్ళిపోతున్నారంటే సంతోషంకాదు. అనంతరము మనకాపరాన్ని మనం సరిదిద్దుకొని స్వర్గధామాన్ని కల్పించుకోడంలో ఉన్నది భారంఅంతా. భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడితేగాని ప్రత్యేకంగా నిలువతగిన జాతీయులకు మోక్షంలేదు. ఆవిధంగా ఎవరి బాధ్యత వారికి వప్పగించి పెత్తనం వహిస్తే కొన్నిసమస్యలు పరిష్కారమై పోతవి.

మనకు ప్రత్యేక రాష్ట్రం రాకుండా మనజాతికి న్యాయం జరగదు. ఆంధ్రరాష్ట్రం వచ్చితీరాలి. అప్పుడే మనజీవితములను మలచుకొను బాధ్యత మనమీద ఉంటుంది. ఆంధ్రభాషా, సంస్కృతీ, సాహిత్య చరిత్రలకుపృథక్ప్రతిపత్తి చేకూరుతుంది. మన

ఆదాయాన్ని మన అభ్యుదయానికి వినియోగించుకోవచ్చు: ఆంధ్రజాతీయాభ్యుదయానికి ప్రత్యేకరాష్ట్రం ముఖ్యంగా సమకూడాలి. ఎవరిమీద ఆధారపడకుండా జేగీయమానమైన ప్రభతో వర్ధిల్లిన ఆంధ్రజాతి పునరుజ్జీవితం కావడానికి మార్గమదే.

ఈనాటి ఆంధ్రులలో అనేక లోపాలున్నాయి. వాటిని గుర్తించి సవరించుకోవాలి! ఆంధ్రులంతా ఏకమై రాష్ట్ర సంవర్ధకోద్యమంలో పాల్గొనాలి. ఆంధ్ర లెక్కడెక్కడున్నా వారంతా మనవారే. ఏకజాతీయులే. కాని ఏవిధంగా పుట్టాయోకాని మత్సరాలు పెరిగిపోతున్నాయి. రాయలసీమాంధ్రుడు వేరు – నిజామాంధ్రుడు వేరు – సర్కారాంధ్రుడు వేరు – అనే వాక్యాలు విన్పిస్తూఉండడం శోచనీయము. సంపూర్ణమైన ఐక్యత సంభావితం కావాలి. వర్గకల్పనల కవకాశ మీయరాదు. 'మహాంధ్రరాష్ట్రానికి' ఆందోళన చేయాలి. సాధించాలి. అంతేగాని మనలోమనకు తగాదాలు, వివాదాలు పనికిరావు.

అల్లాగే రాయలసీమాంధ్రసోదరుల విషయం. సమైక్యభావంతో కృషిచేయాలి. పూర్వం వున్న కలతల్ని అన్నిటినీ త్రోసిపుచ్చి చేతులు కలపాలి. ఇతర రాష్ట్రాలలోను ప్రాంతాలలోను ఉన్న ప్రవాస ఆంధ్రులంతా దగ్గరకు రావాలి. వారిని మన మందరము సమాదరించాలి.

బ్రిటిషువారు వెళ్ళిపోతున్నారు. వారి ప్రసాదానికి అర్రులుచాచి నిరాశతో క్రుంగిపోయే దౌర్భాగ్యస్థితి తొలగిపోయింది. యావద్భారత దేశమూ ఏకంగా వదలివెళ్ళకుండా ముక్కలుచేసి ఇచ్చి వెళ్ళుతున్నారు. షరాయివాళ్ళు

నిర్ణ్క్రమించిన తర్వాత విడిపోయిన ఏక కుటుంబీయులు సమరసభావముతో సమైక్య మవడం వాంఛితం. ఇప్పుడున్న అవకతవకల్ని రూపుమాపుకో ప్రయత్నించడం ఇకముందు మన కర్తవ్యం. మనలోమనకున్న తగాదాల్ని పైవారు తీర్చలేరు. మనమే కూడబలుక్కొని ఏకాభిప్రాయానికి రావాలి; అందుచేత మనకున్న భారమింతింతగాదు.

ఆంధ్రులు భారత స్వాతంత్ర్యోద్యమంలో అనితర తుల్యంగా కృషిసల్పినారు. ఆంధ్రులు చేసిన త్యాగం ప్రశంసనీయమైనది. కాని అక్కడా ఆంధ్రునికి చోటు అంతంతగానే ఉంది. ఔత్తరాహులకున్న ప్రాధాన్యం ఆంధ్రునికిలేదు. అన్నివిధాలా ఆంధ్రుడధోగతి పాలైపోయినాడు. ఇతనికున్న ప్రతిభకు చేసిన త్యాగానికి తగినంత ఫలమింకా చేకూరలేదు. దాక్షిణాత్యుల దాస్యము, ఔత్తరాహుల అహంకారము అంతరించాలి. ఆంధ్రునికి సరియైన స్థానం లభించాలి. ఆనాడుగాని ఆంధ్రుడు సంతోషించడు.

కావున ఆంధ్రులంతా తమకర్తవ్యాన్ని నిశితంగా పరిశీలించాలి. ముందు తమజాతియొక్క పార్థక్యాన్ని కాపాడుకోవాలి. తమరాష్ట్ర వృద్ధికోసం ఉద్యమించాలి. తమలోని వర్గభేదాల్ని పారద్రోలుకోవాలి. నూత్న విద్యాప్రణాళికల ద్వారా జాతిని పునరుజ్జీవితం చేసుకోవాలి. ఆంధ్రజాతి ఆంధ్రభూమి నేలుకోవాలి! అణువణువునా, ఆంధ్రత్వం వెల్లివిరియాలి. ఆంధ్ర కవిచంద్రుల ఆనంద గీతాలు, ఆంధ్ర ప్రజల జయజయధ్వానాలు మిన్నుముట్టాలి!

[గుంటూరునుంచి వచ్చిన "ఆంధ్ర రిపబ్లిక్" అనే వారపత్రిక ప్రారంభ సంచికలో (15-8-1947) ప్రకటింపబడింది.]

# ఆర్థిక వైజ్ఞానిక వికాసార్థం

ఆంధ్ర భాషామతల్లి అనన్యసాధారణ. ఆంధ్ర సంస్కృతి ప్రాచీనమైనది. ఆంధ్రుల చరిత్ర మహోజ్వల మైనది. ఎట్టి భాషకు, చరిత్రకు. సంస్కృతికి వారసుల మైనందుకు మనము గర్వించవలె. ప్రాచీన సంస్కృతిలోను, చరిత్రలోను, భాషలోను గడించిన ఔన్నత్యమును స్మరించుట చేత మన కర్తవ్యము నెరవేరదు. స్మరించుటయేకాక దాని స్వరూప స్వభావములను నిర్దేశించి, ఇతర సోదరులకు చాటుటయు, ఆ ప్రతిభను పోగొట్టుకొనక నిలుపుకొని అట్టి చరిత్ర, సంస్కృతీ సాహిత్యములకు తగిన వారసులముగా వర్ధిల్లుటయు ప్రధాన విషయములు.

నేడు రాష్ట్రాభిమానము చేతనో జాత్యభిమానము చేతనో ఆంధ్రుల ప్రాచీన మహోన్నతోదంతములను ఏకరువు పెట్టుచున్నారు మనవారు; కాని వానియందెంత ఆత్మశుద్ధి యున్నదో మనము విచారించవలెను. నామమాత్రముగా అభిమానమును ప్రకటించినచాలదు. మనసా, వాచా, కర్మణా ఆంధ్రాభిమానము ప్రస్ఫుటము కావలెను. పూర్వ మహాశయుల గుణగణములను గ్రహించి, వారి యుద్యమములలోని ఆత్మశుద్ధిని పరికించి, వారి ఆచార వ్యవహారములను గుర్తెరిగి మనము నిత్యవ్యవహారములలో అట్లనుగమించుటకు పూనుకొనవలెను. జాత్యభిమానముతో బాటు ఆదర్శమూర్తుల ననుగమించుటయు గావలెను. పతితులమై వారి ఆదర్శములనుగాని, ఆచారములనుగాని హాస్యాస్పదముల జేయుట శోచనీయ

మగును. స్వమతము— స్వజాతి— స్వీయసంస్కృతుల విడనాడక— సంప్రదాయ విచ్ఛిత్తిని కలుగనీయక కాపాడుకొనుచు ఎంతకాలము మనసోదరులు మెలగుదురో అంతవరకు నైతికమత్యము చెడదు.

ఏవిషయమైనను సునిశితముగా పరిశీలించుటయందును, దానిని వ్యాప్తినొందించుట యందును పరిణతి పొందును. ఇందులకు విజ్ఞాన వివేకములు కావలసియున్నవి. వీనినార్జించి యాంధ్రులు తమ కర్తవ్యమును నిర్వర్తింపవలెను.

ఆంధ్రభాష శతాబ్దులు తరబడి అనేక విషయముల కాలవాలమై అనేక భాషాసంప్రదాయముల సహవాసముతో విలసిల్లినది. అనేక స్థలముల నా భాషావాహిని అనేక గతుల నడిచినది. ఆయా ప్రదేశముల కనుగుణముగ నది వర్తిలినది. అన్నిట నొకేరీతిగా నుండలేదను అపవాదు యుక్తియుక్తము గాదు. వివిధ ప్రక్రియలలో వివిధ ప్రదేశాలలో పాత్రలనోట వర్తిలు భాష వివిధముగా నుండునుగదా. భాష యెప్పుడును భావవాహికయే! మాండలిక కాలవైచిత్రిని తెలసి మెలగవలె.

ఆంధ్రసాహితి బహు విషయముల ఖని; రసమూర్తి. అందలి కావ్యములలోని సౌందర్యము నవలోకించుట చాల అవసరము. తదితర సాహిత్యములలోని మెరుగు తెరుగుట న్యూనతగా తలపరాదు. అందలి ప్రశస్తాంశములను మన భాషలోనికి ననువదించుట యందును శ్రద్ధపూనవలయును. సహృదయముతో భావవస్తు రచనలను పరిశీలించుశక్తి యల వరచుకొనవలెను. సాహిత్యమునకు కావ్యసృష్టి— కావ్య విమర్శ లత్యంతోపస్కారకములు.

ఆంధ్రుల భాషాసాహితీ సంస్కృతీ చరిత్రలు సర్వతో ముఖముగా వృద్ధిచెంది నొక అభ్యున్నతికి రావలసిన అవసర మెంతేనికలదు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమే వలసినట్టిది. ఎన్ని సంవత్సరములైనది ఆంధ్రరాష్ట్రోద్యమము ప్రారంభమై? స్వాతంత్ర్యముతోడ రావలసిన స్వరాష్ట్రమింతవరకును గుంట పూలు పూయుచునే ఉన్నది. జొత్తరాహులకీ సమస్య ప్రముఖ మైనదిగాదు. ఆసులోచనాలతో దక్షిణాది సమస్యల జూచిన పొసగదు. కావున భాషా ప్రయుక్త రాష్ట్రావశ్యకత దేశ నాయకులు గుర్తించి సత్వర మమలు జరుపవలసి ఉన్నది.

ఆంధ్ర రాష్ట్రావతరణము వలన వైజ్ఞానిక వికాస ముద్భవించుటయేకాక, సర్వసాధారణ సమస్యలైన "కూడు-గుడ్డ-నీరు-నీడ" లన్నవికూడ అమరగలవు. ఏ తదావిర్భావ మును నిరీక్షింతము.

[మద్రాసు నుంచి వచ్చే "జై భారత్" అనే వారపత్రికలో 1948 లో ప్రకటితము]

# ధర్మ సంస్థాపనం

ఏకాలంలోనైనా అధర్మం ప్రబలడమంటూ ఉండనే ఉన్నది. ఆ అధర్మం పెచ్చు పెరిగిపోయి మానవత్వాన్నే ధిక్కరించేటంత స్థితికి వచ్చేసరికి ఏమహానుభావుడో, ఏఉద్యమమో ధర్మసంస్థాపనం నిమిత్తం అవతరిస్తారు. చరిత్రను చదివితే మనకు బోధపడేది యీ సూత్రమే. మానవుల్ని మించిన ఒక మహత్తరశక్తి ఏదో ఉండి ఇలాంటి ధర్మం నెరవేరుస్తూ ఉంటుందని అంటే ఈనాటి నాగరకులకు చాదస్తంగా ఉండవచ్చునేమో కాని, మనకు దాఖలా లగుపిస్తున్నంత సేపూ ఇది యదార్థ సూత్రమని నమ్మడానికి అభ్యంతరం ఉండరాదు.

ఒక మానవునిలో అధర్మం ప్రబలునపుడు అతని వివేచన కొంతవరకు సరిదిద్దుతుంది అతణ్ణి. లేకపోతే అతని స్నేహితుడు ఎవరో ఒకరు అతణ్ణి ధర్మమార్గ ప్రవర్తకుణ్ణి చేస్తాడు. కుటుంబంలో ఎవరైనా నిష్టూరాలు ఆడో, లేకపోతే నెమ్మదిగా చెప్పో అతణ్ణి అపమార్గంనుంచి తప్పిస్తారు. వారి ప్రయత్నంలో వాళ్ళు సఫలురుకావచ్చు. ఒక్కొక్కప్పుడు కాకపోవచ్చు. ఏమైనా వాళ్ళు చెప్పడం మట్టుకూ చెపుతారు ఈవిధంగా మానవుడు ధార్మిక జీవితం గడపడానికి వీలున్నది.

అందాకా ఎందుకు? అధర్మం ఆచరిస్తున్నవాడి అంతరాత్మే అతణ్ణి వెనక్కు లాగుతుంది ఇలా అనడంవల్ల ధర్మసంస్థాపనమనేది ప్రతిమానవునిలోను బీజభూతంగా ఉండనే ఉన్నదని గుర్తించ గలుగుతున్నాము గురువు శిష్యుడుకిచ్చే

శిక్షణలో కూడా ఈ ధర్మ సంస్థాపనే సూత్రప్రాయమై ఇమిడి ఉంది. ఉపాధ్యాయుడు శిష్యుణ్ణి బోధపరచడంలో అనేక మార్గాల్ని అవలంబిస్తాడు. ప్రాచీన కాలంలో ఉత్తమాదర్శ జీవితం గడిపినవారిని గూర్చి చెప్పి అల్లాగుండాలి అని చెప్పడం ఒకపద్ధతి. దుష్టులైన వారినిగూర్చి చెప్పి అల్లాగుండరాదని బోధించే పద్ధతి మరొకటి అధర్మ మార్గంలో ప్రవర్తించిన వారిని శిక్షించడంకూడా ఒక పద్ధతే. అలా శిక్ష పొందిన వాళ్ళు మళ్ళీ అలాంటి అధర్మం ఆచరించకుండా ఉంటారని ఇందులో రహస్యం.

ఈరోజుల్లో 'శిక్ష'కు అవకాశం అట్టే లేదు, నాగరకత మిక్కుటమై పోయింది. స్వాతంత్ర్యం వచ్చినాక అభిమానం ప్రజల్లో హెచ్చిపోయింది; మాటపడేటట్లు లేరు. 'శిక్ష' అనే ఊహకే అవకాశం లేకుండాలనే వాదం ప్రబలిపోయింది. ఎవరేపని చేసినా, హర్షించేటంత విశాల హృదయ భావం ప్రపంచానికి అలవడుతున్నది. వేలెట్టి చూపించరాదు. సహనమంటూ ఎక్కడా కన్పించడంలేదు. అధర్మమని చెప్పడానికి ఎవరికీ హక్కులేదు. అంతగా వ్యక్తిస్వాతంత్ర్యం హెచ్చిపోయింది. మానవుడెలా చేసినా ధర్మమనుకొని ఊరుకోవలసిందే కాని విమర్శించడంకూడా నాగరక లక్షణం కాదనే ధోరణికి దిగింది.

దీన్నిబట్టి ఈనాడు మన సంఘంలో అధర్మం ప్రబలిపోయింది; అన్యాయం, అతిశయించింది; మోసం ముదిరిపోయింది. ఎవరికివాడు ప్రపంచం తనకోసమే ఉన్నది అను

కోనేవాడే! అందులో ఇతరులకుకూడా అవకాశం ఉన్నదని భావించేవాళ్ళు కరువై పోయినారు.

ఇలాంటి సందర్భంలో ధర్మసంస్థాపనం ఎల్లాగో! రాజులు పూర్వం ధర్మసంస్థాపనానికి బాధ్యత వహించేవాళ్లు. ఈనాడు అధికారులే అధర్మ సంస్థాపనానికి బాధ్యత వహిస్తున్నారాయె! విప్రకులం కొంతవరకు మార్గాన్ని చూపించేది పూర్వం. ఇపుడు దానికాశక్తి పోయింది. ఆస్థానమూ దానికి దక్కనివ్వనూలేదు ప్రపంచం!

ఏదైనా, యీనాటి సంఘంలో పెరిగిపోతూన్న స్వార్థాన్ని, అధర్మాన్ని, పారద్రోలాలని అందరూ అనుకుంటున్నారు. మార్గమేదో అన్వేషించి నిర్ధారించాలి! అది ఆత్మశోధనలో ఉన్నదని గుర్తిస్తారా!

* * * *

[విజయనగరం నుంచి వచ్చే "మాతృసేవ" అనే వారపత్రికలో 25-2-1949 లో ప్రకటితము.]



# ప్రతి మానవుడూ గాంధీ కావాలి

ఎంతో పుణ్యంచేసుగొని ఉంటేగాని జీవికి మానవత్వం లభించదు.

అయితే ఇంత దుర్లభమైన జన్మ లభ్యమైన తర్వాత జీవిని ఎన్నివిధాల పరీక్ష చెయ్యాలో అన్నివిధాలా పరీక్షిస్తాడా భగవానుడు. ఉత్తమ సాధకుడై ఆత్మతత్వాన్ని కనుక్కునే ప్రజ్ఞ ఎక్కడవచ్చి పోతుందో అన్నట్లుగా మానవుణ్ణి యాతనల్ని అనుభవింప జేస్తాడు, ఎన్ని అవాంతరాలు వచ్చినా నిలువగల ధీరనిశ్చల హృదయుల్నే, దరిజేర్చు కుంటాడు. వాళ్లకే ప్రసన్నుడౌతాడు. ఆస్థితి పొందకుండా అంతశ్శత్రువుల్ని దారిలో నిలిపినాడు. ఈ శత్రులసాధ్యులు! కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలని వీటిపేర్లు. వీటికి గురిఅయిపోయి, మానవులలో అనేకులు జీవితాన్నంతా వాటి అధీనంలో గడిపివేసి మోసపోతారు. వాటి క్రూర దంష్ట్రల క్రింద నలుగుడుపడని మానవుడుండడు. ఎన్ని ఆవరణలు దాటితేనోగాని ఆత్మదర్శనావరణము తగులదు. రజస్తమో గుణాలే ప్రధానంగా ఏలికలై ఉంటాయి. సత్వగుణమనేది గగన కుసుమంలాగానే నిలిచిపోతుంది. రాగద్వేషాలు రగుల్కొని మానవుడు పెరిగినకొద్దీ అవీ ప్రజ్వలిస్తాయి. వీటితో బాటు దురహంకారం, దౌష్ట్యం ప్రబలుతాయి.

రజస్తమో గుణాల్నీ, రాగద్వేషాల్నీ అహంకార మమకారాల్నీ, అంతశ్శత్రువుల్నీ బాగా పోషించే నిమిత్తం మరికొన్ని అమరుతున్నాయి. అసత్యమూ, పరుషమూ అయిన వాక్కు ఒకటి; అహింసాత్మకమైన ప్రవర్తన ఒకటి; అసహ

జదాంభిక ప్రవృత్తి ఒకటి; మోసంచేయడం, సనాతన సంప్రదాయాల్ని తూలనాడడం, ఏళ్లతరబడిగా ఉపనిషత్తులు ఘోషిస్తున్న ధర్మసూక్తుల్ని పాటించకపోవడం, క్రమేణా వృద్ధిఅయ్యే టటువంటివి; ఇలా మానవుణ్ణి మాయావరణాన్ని దాటకుండా చేసేవి అనేకం ఉన్నాయి. కాని వాటిని తరించడానికి మానవుడొక్కడే శక్తిమంతుడు. అలా తరించడమే మానవజన్మకు పరమ లక్ష్యం. అసలీ మానవజన్మే జీవికి పెద్ద పరీక్ష!

"సత్యంవద - ధర్మంచర - సహనావవతు - అహింసా పరమోధర్మః - ఆత్మవత్సర్వభూతాని-" మొదలైన మహావాక్యాలన్నీ మానవుణ్ణి ఉత్తమసాధకునిగా తీర్చి దిద్దేటందుకు ఉద్దేశింపబడినాయి. ఉపనిషత్తులేకాదు. అన్ని ఉద్గ్రంథాలూ వీటినే బోధిస్తున్నాయని తెలుసుకుంటాము. మానవుడు ఆత్మతత్వాన్ని తెలుసుకోనేటట్టు చేసేందుకు యుగయుగాన ఉత్తమపురుషులు అవతరిస్తూ ఉన్నారు. వాళ్ళు తమజీవితాలను మానవుల యెదుట ఉదాహరణాలుగా ఉంచుతూ మూల సూత్రాల్ని వ్యాఖ్యానంచేసి చెప్తుతూ మానవునికి ఆత్మవేదనోన్ముఖమైన అంతరంగం సమకూర్చేటందుకు పయత్నిస్తారు; అర్థకామాలను అతిక్రమించీ, ధర్మబద్ధమైన ఆదర్శప్రాయమైన మానవ జీవితాన్నిగడిపి, మోక్ష సాధకుడు కావడానికి బోధిస్తారు. ఈ అవతార పురుషులు మహాకవులుగా ద్రష్టలుగా - ప్రవక్తలుగా - నాయకులుగా ఎన్నెన్ని పేర్లతోనో సాక్షాత్కరించవచ్చు. శంకరుడు - రామానుజుడు - బుద్ధుడు - క్రీస్తు - మహమ్మదు - వేమన - కబీరు - రామకృష్ణ

పరమహంస - వివేకానందుడు - గురుగోవిందుడు - రమణ మహర్షి - అరవిందుడు - ఆదిగాగలవారు ఉత్తమ మానవుణ్ణి నిష్కల్మషునిగా, వివేకిగా, ఉత్తమసాధకునిగా దిద్దడానికి అవతరించినట్లు వారి బోధలు తెలుపుతాయి.

ఆ శ్రేణిలో చేర్చదగిన ప్రత్యక్ష మహాత్ముడు మనకు మోహనదాసు కరమ్ చంద్ గాంధీ! సత్యాహింసల్ని తన ఆయుధాలుగా పెట్టుకున్న సాధకు డీయన. ప్రజాసేవ కీయన జీవితం దృష్టాంతం అవుతుంది. ఇంతటి త్యాగమూర్తి మనకు వేరుగా కన్పించడు. సహనమీయనకు ఊపిరివంటిది. దరిద్రులపాలిటి నారాయణుడు. హింసలో భావహింసనైన సహించడు. అందుచేతనే హరిజనుల నుద్ధరింప గలిగినాడు. తోటివాణ్ణి ప్రేమించడంలో ఈయన కీయనే సాటి!

ఈనాటి మానవలోకం చెడి పోయింది. కులమత విభేదాలు రేగి పెచ్చుపెరిగి మానవుల్ని రాక్షసులనుగా మార్చి వేస్తున్నాయి. అసత్యం - ఆదర్శం - మోసం - కృత్రిమత్వం- దౌష్ట్యం- దురహంకారం- అధికారవాంఛ- దాంభిక ప్రవృత్తి - రాగద్వేషాలు - స్వార్థకాంక్షలు అత్యధికంగా ప్రబలిపోయినాయి. శాంతిదూత, ఉత్తమ సాధకుడూ అయిన గాంధీ ఎదుటనే భారతదేశంలో ఇలాంటి కలుష భావాలు ప్రాదుర్భవించడము ఆశ్చర్యాన్నే కలుగజేసి, ఆయనను కలత పెట్టినాయి. గాంధీ ఉత్తమత్వాన్ని సాధించుకున్నాడు కాని ఆయన బోధల్ని విని ఆచరణలో పెట్టే ప్రజయేది? అక్కడే ఉన్నది లోపం. ఈ ప్రళయానికి కారణంకూడా అదే. ఆయన అనుయాయు లాత్మశుద్ధి కలిగివుండకపోవడము మరీ కలత పెట్టు

లేకున్న అంశం. ఇతరవర్గాలలో మానవత్వం నశించినదని అనుకుంటూ ఉండడము, ఏవర్గంవాళ్లు కావర్గం వాళ్లనుకుంటూ ఉండడము పరిపాటయి పోయింది. గాంధీ అనుయాయులాత్మశోధనం చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

వినోబాభావే మళ్ళీ మనకు నిష్కళంకశీలుడు కన్పిస్తున్నాడు. ప్రేమైకమూర్తి అతడు. ఆయన గాంధీగారి శిష్యుడే! అయితే ఆత్మసాధన వలన ఆవిధముగా లోకాన్ని ఆకర్షింపగలిగినాడన్న సత్యాన్ని గమనించాలి.

ఉత్తమ సాధక లక్షణాలను పుణికిపుచ్చుకొన్నవారు శతధా రావాలి. గాంధీ ప్రతిమానవ హృదయంలోను ప్రతిఫలించిననాడే ఈనాటి దుర్భరస్థితి అంతమొందుతుంది. ప్రతి మానవుడు తానెంతవరకు గాంధీ అయినాడో పరిశీలించుకుంటూ ఉత్తమత్వానికి సాధనచేస్తే మానవజన్మ పునీత మౌతుంది. గాంధీ అనుయాయులు అసిధారావ్రతముగా ఆయనగారి సూత్రాలకు బద్ధమైన జీవితాన్ని గడపడం ధర్మంగా భావించి ఏతదుద్యమాన్ని కొనసాగించాలి.

గాంధీ కాంగ్రెసుకే నాయకుడు కాడని లోకము గుర్తించింది. మానవనాయకమణి అని తెలుసుకున్నది. ప్రపంచంలో ఈకాలాన ఉద్భవించిన మహోదార ప్రేమైకమూర్తి ఆయన అని కీర్తించింది. కనుకనే యావత్ మానవకోటికీ ఆయన సూత్రాలు ధ్యేయాలు! అనుసరణీయాలు లోకకల్యాణ ప్రదకారకాలు !!! దీన్ని గమనించి మానవకోటి తత్రాపి భారతీయులు తరింతురు గావుత.

[మద్రాసు నుంచి వచ్చిన "కాంగ్రెసు" అనే ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు వారపత్రికలో ప్రచురితము.]

# ప్రతిభావంతులు - లౌకిక దృష్టి

సామాన్యంగా లోకంలో ప్రతిభావంతుల సంఖ్య ఎప్పుడూ హెచ్చుగా ఉండదు. అందులోనూ ఆ ప్రతిభావంతులకు మంచి అవకాశాలంటూ తరచుగా రానేరావు. వచ్చినా చూచి సహించి సమ్మానించేవారు అరుదుగా ఉంటారు. అందుకనే లోకంలో ఏకాలంలోనైనా ప్రతిభావంతుల జీవితం కష్టపూరితమైనట్లు గమనిస్తాము. వీళ్ళవలన ఇతరులు చాలమంది సుఖపడతారు. వీరికి మాత్రము తమ ప్రజ్ఞకు తగినఫలము చేకూరడం అరుదు, సంపూర్ణ సౌఖ్యమూ అమరదు.

మళ్ళీ ప్రతిభావంతులలో దేశనాయకులు, మత ప్రవక్తలు, ఉపాధ్యాయులు, కవులు అని విభజించి వారివారి జీవితాలను పరికిస్తే అంతరాలు – సుఖదుఃఖాలలో – కన్పిస్తవి.

దేశనాయకులు తమ అనుయాయులద్వారా, రాజకీయ పక్షాలద్వారా కొంతస్వార్థాన్ని తృప్తిపరచుకోగలరు. త్యాగాన్ని గోరంతచేసి కొండంతగా తమ అనుయాయులచే చెప్పించుకోగలరు. వారికున్నంత "చాటింపు" మరొకరికి లేదనే చెప్పాలి. వారింట్లో ఏమిజరిగినా, (పిల్లి సమర్తాడినా, దున్నపోతుఈనినా) వారి నోటివెంట ఏ తుంపరవచ్చినా, (అది ఉమ్మి కానీయండి, చొంగ కానీయండి. నెమరువేస్తుంటే వడేనురుగు కానీయండి, సుధకానీయండి) పత్రికలలో ప్రముఖముగా సచిత్రంగా ప్రకటితంకావడం ఎంత అదృష్టం! ఇంతటి ప్రచార ప్రాముఖ్యాలు మిగతా ప్రతిభావంతుల కెక్కడివి?

మతప్రవక్తలున్నారంటే వారికీ శిష్యకోటి ఉన్నది. మిగతా ప్రపంచం ఆదరించకపోయినా తమకు వారి శిష్యులు బ్రహ్మరథం పడతారు ఏ సౌఖ్యం కావాలంటే దాన్ని చేకూర్చి పెట్టుతారు. ఇంకా రాజకీయ నాయకులు అనుయాయులలో మోసం ఒక్కొక్కప్పుడు కన్పించి వారి సౌఖ్యానికి భంగము కలుగజేయవచ్చునేమో కాని, మత ప్రవక్తలకు శిష్యులు మాత్రం విధేయులుగా ఉండి భక్తివిశ్వాసాలను అత్యంతగా ప్రకటిస్తారు. అయితే దేశమంతటా పత్రికల ద్వారా అంత హెచ్చుప్రచారం వీరికి లభించదు. అందుచేతనే ప్రత్యేకంగా వీళ్ళు తమ శిష్యకోటినిమాత్రం చెదరి పోనీయకుండా, పత్రికలను కొన్ని పెట్టి తద్వారా ఆకట్టుకుంటూ ఉంటారు. ఈ శిష్యకోటిలో వృద్ధులూ, వితంతువులూ, విధురులూ హెచ్చుగా ఉండడం గమనించదగ్గది; హెచ్చుగా వీరు తమ పూర్వజీవిత కాలములో తప్పిదాలుచేసి ఆ పాపాన్ని పోగొట్టు కునే చింతతో పోగవుతూ ఉంటారు. ఏ దృష్టితో చేరినా మత ప్రవక్తల సౌఖ్యానికేమీ భంగములేదు, ఏ కాలములోనైనా!

ఇంక ఉపాధ్యాయులు విజ్ఞానానికి కేంద్రాలు. చదువుకున్నంతవరకు విజ్ఞానార్జనముపైన తృష్ణ వీరి కధికమే. విద్యార్థిదశలో, ఆశయాలున్నతంగా ఉంటవి వీరికి. ఆదర్శ సంఘాన్ని నిర్మించాలని వీరికెక్కడాలేని ఆశ. వర్గకలహాలను పోనాడవలెనని వీరియత్నం అంటారు. నైతికాభ్యుదయము వీరిలక్ష్యం. అయితే ఇవన్నీ చదువుకొనే కాలములో వీరికి తట్టే ఉత్తమోదార భావాలు - వాస్తవిక జీవితంలోకి

రాగానే ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించినవ్వారిలో అనేకులు ఉదరనిమిత్తం బహువేషాలు ధరించి ఆశయాలను ఆదర్శాలను బలిగావిస్తున్నారు. వీరికి సౌఖ్యం అసలు కన్పించదు. విద్యా విధానంలో ఉన్న లోపాలు అనేకాలు వీరిని స్వచ్ఛందులను కాకుండా చేస్తున్నవి; కుటుంబ పోషణభారం వీరిని లౌకికుల్ని చేసి పతితుల్ని చేసివేస్తున్నది. వీరికీ శిష్యులున్నారు. అయితే వీరు మంచిని కీర్తించి సమ్మానించేవారు కారు; ఉపాధ్యాయుల చెరుపుల్నీ వారి లోపాలను ప్రపంచించి ప్రచారం చేసి ఎగతాళిచేయడములో హెచ్చుగా కృషిచేసేవారు పోగవుతున్నారు. అందుచేత ఉపాధ్యాయునికి సౌఖ్యంకన్నా దైన్యంహెచ్చుగా లభ్యమవుతున్నది. ఒకప్పుడు శిష్యులు పాలు, పెరుగు, కూరలు ఇంకా ఇంకా సప్లయిచేసేవారట - గ్రామసీమలలో. ఏమైనా ఇప్పుడు మాత్రం వీరిస్థితి నాలోచించేవారు వీరిని దుఃఖపెట్టేవారే అవుతున్నారు. పాఠాలున్నది వీరు చదువుకోడానికి పరీక్షలంటూవస్తే ప్రశ్నాపత్రాలివ్వాలి వీరు, సమాధానపత్రాలు దిద్దడానికి. వెట్టిచాకిరి మాష్టరుది. విద్యార్థులు వినోదంగా కాలక్షేపం చేస్తారు. మళ్లీ వాళ్లను ప్యాసుచేయడం వీరివంతే; లేకపోతేనా? వీరి ప్రతిభ కూడ పాపం లౌకికాయత్తమైపోతూ, క్రమంగా ప్రతిభాశూన్యతే ఈవృత్తి అవలంబించడానికి కారణమని ఇతరులచేత అనిపించుకునేటంత దుస్థితికి వచ్చింది. ఏమైనా ఉపాధ్యాయుని మనుగడ దుర్భరంగానే ఉన్నదనాలి.

ఇంకపోతే కవులు: వీరి ప్రతిభ అసామాన్యమైనదే. అయితే ఈకవులలో అనేక రకాలవారున్నారు. వీరిలో చాల

మంది ప్రతిభకూడా, లౌకిక వ్యవహారాలకు చెందినదౌతూ వ్యర్థమై పోతున్నట్లుగమనిస్తాము. అందులోను పాఠ్యగ్రంథాలంటూ వచ్చి కవుల ప్రాణాలు తీస్తున్నట్లు తెలుసుకోగల్గుతాము. ఈ కవులవెంట పబ్లిషర్లుంటారు. వారు వీరినెత్తిన చేయి పెట్టి చూస్తారు. వారి పుస్తకం కలసిరాకపోతే రచయిత తల తిప్పలు దేవునకే ఎరుక! వినోదానికి విజ్ఞానానికీ వ్రాసే కవుల గ్రంథాలకు ఆదరంచూపే ఆంధ్రలోకం ఇంకారావాల్సే ఉన్నదిగదా. మనకసలు శిష్యులెవరో కానివారెవరో వివేచించే శక్తి అలవడేస్థితి తప్పిపోయింది. పైగా రచయితకాని వాడిది పాపం అన్నంత చులకన అయిపోయింది. రచయితృ ధర్మం పాఠ్యగ్రంథాలు వ్రాసి పైసా గడిద్దామన్న ఆశయమే హెచ్చి చాలమంది కవులు పండితులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి పబ్లిషర్ల కమ్ముడు పోవడంవల్ల ఆత్మతృప్తి అన్నది కన్పించకుండా పోతున్నది. ఇది శోచనీయావస్థ. దీనికి కవుల దారిద్ర్యమే ముఖ్యకారణం.

త్రికరణశుద్ధిగా ఆదర్శాలను పెట్టుకొని సాహిత్యసేవ చేద్దామనుకున్న ఋషి అడుక్కు తినాల్సే ఉన్నది. అతడు చేసిన కృషి నభినందించేవారూ లేక, అచ్చు వేసుకునేవారు దొరకకా, సొంతంగా అచ్చేసుకున్నా పుస్తకాలు అమ్ముడు పోకా, ఏవిధమైన ప్రోత్సాహం చేకూరకా ఉంటున్నాడు కవి. ఇలాంటివారికి ప్రచారంలేదు. పైగా వర్గ వైషమ్యాలు పెరిగి పోతూ రచయితల పైనకూడ ఆ ప్రభావం పడుతూండడం విచారింపతగ్గది. రచయితలలోను ముఠాలు ఏర్పడడం శోచ

నీయము. కొన్ని సందర్భాలలో గ్రంథాలు వ్రాయడం ఒకరు; పేరు మరొకరిదీ కావడం చిత్రమైనది!

ఏదైనా వ్యాపారానికి ప్రతిభ ఎప్పుడైతే వినియోగ పడాలని ప్రయత్నం చేశారో అపుడే దాని విలువ తగ్గిపోయినట్లు తెలుసుకోవాలి. విజ్ఞానానికీ, వికాసానికీ, వినోదానికీ ఉపకరించినంత కాలమూ ప్రతిభ, ప్రశస్తి వహిస్తుందన్న సత్యాన్ని ప్రతిభావంతులు గుర్తించాలని మనవిచేస్తున్నాను.

[గుంటూరు నుంచి వచ్చిన "శాంతి" అనే వారపత్రికలో (15-8-1952) లో ప్రచురింపబడింది.]

★

# పత్రికా నిర్వహణం

ఏ సంస్థనైనా స్థాపించడం ఒక యెత్తు. దాన్ని నిర్వహించడం మరో యెత్తు. ఆంధ్రదేశంలో రోజుకు ఎన్నో సంస్థలు స్థాపింప బడుతున్నాయి. కాని మరునాడు మాయమై పోతున్నై. కారణం? నిర్వహణాలోపమే! అసలు సంస్థ అనేది ప్రారంభం కావడం నలుగురు చేరితేనే సరికాదు. ఆ నలుగురూ నిర్వహించడంలో ఉంది. ప్రారంభించేటప్పుడున్న ఉత్సాహం చివరదాకా ఉండడం అసాధారణంగా అగుపిస్తున్నది. 'ఆరంభ శూరత్వము' నేది మన ఆంధ్రులకు లేకపోలేదు; అసలాముక్క మనతోనే వచ్చింది! మన లోపాల్ని మనం కప్పిపుచ్చుకోకూడదు. మనవాళ్ళు మొదటే ఊహాసౌధాల్ని కట్టివేస్తారు పునాదులు లేకుండా. అందుకనే కూలిపోతూ ఉంటాయి మరుక్షణం. ప్రారంభించిన నలుగురూ సామరస్యంతో మెలిగితే కావల్సిందింకేముంటుంది? అదే లోపం యీ సంస్థా నిర్వాహకుల్లో. మన ఆరోగ్యం - మనసంతోష మంటే కాదు. నేటి ప్రపంచంలో మానవులంతా సమానులం. ఎక్కువ తక్కువ భేదాలుగాని, మత భేదాలుగాని మాసిపోయే దినాలు. అలాంటప్పుడు ఏకీభావం ఏర్పడుతుంది. ఏసంస్థ ఐనా ఐకమత్యంతో సాగిపోవడానికి సహకారంకూడా అవసరం. ఒకరు ఏటికి లాగితే మరొకరు కోటికి లాగేలా ఉండకూడదు.

ఉదాహరణకి సారస్వత సంస్థల్ని తీసుకుందాం, మన మెఱిగున్నంతలో ఏసంస్థ ఒడుదుడుకుల్లేకుండా నడిచిందో చూడండి! కళాశాలల్లో సైతం సారస్వత సంస్థల్లో కల్లోలాలు జరక్కుండా బయటికొస్తున్నారా నిర్వాహకవర్గ సభ్యులు?

కార్యస్థానంకోసం వాంఛించి కష్టించడం, స్థానం చేకూరిం తర్వాత తమ విధులను విస్మరించడం: ఈ విషయం మనం కళ్ళారా చూస్తున్నదే!

పత్రికా నిర్వాహణం తీసుకుందాం. పత్రికా నిర్వాహణం అగుపించేటంత సులభం గాదు. "తింటేగాని రుచి తెలియదు, దిగితేగాని లోతు తెలియదు"దన్నారు పెద్దలు. అల్లాగే పత్రికను నడిపిస్తేనే గాని అందులోని కష్టసుఖాలు తెలియవు. పత్రికకు మంచి ఆదరణ, తోడ్పాటు అన్నివిధాలా ఉండాలి. పాఠకులు, రచయితలు, కాగితం, అచ్చు, సహాయ సంపాదకులు, విలేఖరులు, సంపాదకుడు, ఇంకా ఎన్నో, ఎన్నో... ముఖ్యాంగాలు పత్రికకు! ఇన్నీ ఉంటేగాని పత్రిక అనేది బయటకిరాదు. ఇంతాచేస్తే పత్రిక వెలను చూసి ముఖం త్రిప్పుతున్నారు... ఎందుకని? ఆంధ్ర దేశంలో ఎన్ని పత్రికలు పుట్టుతున్నాయి? ఎన్ని గిట్టుతున్నై? నిజంగా ఈలెక్కల్ని పరిశీలిస్తే నిరుత్సాహం కలుగుతున్నది. కొన్ని మఖలో పుట్టి పుబ్బలో ఆరిపోవడానికి కారణం, ప్రజాదరణ లేకపోవడమే. ప్రజాదరణం లేనిదే యే సంస్థా పైకిరాదు; అందులో ప్రజా స్వామ్య దేశంలో.

సహానం అత్యవసరం. చూపోపములు పనికిరావు. మనపాఠకులకేమి, రచయితలకేమి, మరెవ్వరికిగాని యీ సామరస్యం కుదరాలి. ఆ పత్రికచేస్తున్న సారస్వతసేవ అమోఘమై యుండవచ్చు. ఆదరణా, ప్రాపకమూ లేనిదే అది పైకి రాలేదు. అమ్మకమును బట్టియున్నా, ప్రచారమునుబట్టి యున్నా, పత్రికలస్థితిని గ్రహింపవచ్చు! తెలుగులో ఇటీవల

పత్రికలు చాలా బయలుదేరినై. సినిమావీ, రాజకీయ మతాలవీ, కామపరమైనవీ హెచ్చు. సారస్వతానికి వినియోగ పడేవి కొద్ది. అయినా పోటీచూసుకుంటూ సారస్వత సేవ మరవకుండా, వ్యాపారం కుంటుపడకుండా చూచుకోవచ్చు.

మన పాఠకులకొక దురలవాటున్నది; చెబితే కోపం రాకూడదు. దిద్దుకునేందుకు ప్రయత్నించాలని కోరిక. ఒక పత్రికను ఒకరు కొంటే కాగితం కాగితం చింపుకుని పదిమంది చదవడం. గ్రంథాలయాలు పాపం మనపాఠకుల శరణాలయాలవుతున్నాయి అంటే సత్యదూరంకాదు. అక్కడా అంతే! వీపుమీదనుంచి చూచేవాళ్ళు; క్రిందనుంచి చూచే వాళ్ళు. ఒక కాగితం ఇస్తారూ అనేవాళ్ళు. బీదవాళ్ళ నలా ఉంచండి. కలవాళ్ళూ అంతే! దీనివల్ల పత్రికలు అమ్ముడు పోవు; అంటే పత్రికా నిర్వాహకులకు ఎంతదెబ్బో గమనించండి. మనము ఆర్థికంగా అంత తక్కువస్థితిలో ఉన్నామా? రోజు కో అణా పత్రికకోసం ఖర్చుపెట్టలేని స్థితిలో ఉన్నామా? ఉదయాన్నే కాఫీకోసం రెండుఅణాలు ఖర్చుపెట్టడం పరిపాటయి పోయింది. పత్రికకంత అదృష్టంపట్టలేదింకా. కాని రైళ్ళల్లో ప్రయాణంచేసేటప్పుడు పోకుకోసం నేటి యువకులు పత్రికను కొంటారు. సామాన్యంగా రైల్లో ఇతరప్రయాణీకులు చదువుకుంటూ రా పత్రికను. ఆ కొనడము ఇంగ్లీషుపత్రికనే కొంటారు మన యువకులు. తెలుగుపత్రికలు కొంటే నామోషీ, గౌరవానికి లోటూఅని తలచే దౌర్భాగ్యం పట్టింది. చదువుకున్న యువకులే (రేపటి పెద్దలు) ఇలాఉంటే తెలుగుపత్రికలెల్లా నెగ్గుతాయి చెప్పండి.

మన పత్రికా నిర్వాహకులకూడా చెప్పాల్సిన విషయాలు లేకపోలేదు. తమ పత్రిక సర్వతోముఖంగా ఉండేటట్లు చూచుకోవాలి. అంటే అన్ని శాఖల్లోనూ విషయాలు స్వీకరించాలి. నిరుత్సాహపడకుండా నడపాలి కొన్నాళ్ళు; నష్టాన్ని భరించాలి. వ్యాసాలు మరీ విసుగు పుట్టించేవి కాకుండా చక్కగా ఉపయుక్తమయ్యేవి, నీతి బాహ్యమైనవీ కాకుండా ఉండేవీ, ఏరడంలో సంపాదకులు శ్రద్ధ బూనాలి. సంఘాన్ని సరియైన మార్గంలో పెట్టేటట్టు, ప్రబోధకంగా ఉండాలి విషయాలు. ఏ సమస్యనైనా పక్షపాతంలేకుండా నిర్మొగమాటంగా పూర్వాపరాలను వితర్కించి ఎదుర్కోగల స్థైర్యం సంపాదకుల కుండాలి.

ఆంధ్రులంతా తమ పత్రికల్ని పోషించుకొని నిలబెట్టుకోవాలి. మాకు నేడు ఇన్ని పత్రికలున్నాయని మురిసిపోవడంకాదు. వాటిని నిలబెట్టుకోవడమే మన కర్తవ్యం. మరీ నాలుగు పేజీలు, రెండు పేజీలు పత్రికలు కాకుండా వ్యాసాలు ఎక్కువగా తెప్పిస్తూ, సర్వాంగ సుందరాంగా తయారు జేయడం సంపాదకుల విధి. అదొక వ్యాపారంకనుక అధికారులచే ఆయా విషయాలపై వ్యాసాలను వ్రాయిస్తూ, తత్కర్తలకు ముట్టజెప్పుతూ, స్థాయిని పెంచేందుకు యత్నించాలి.

[రాజమహేంద్రవరము నుంచి వచ్చేది 'దీపిక' అనే పత్రికలో
1941 లో ప్రచురింపబడింది.]



# ప్రజాసేవే పత్రికల లక్ష్యం

ప్రతి ఆంధ్రుడూ తన శక్తికొద్దీ తెలుగుపత్రికల్ని ఆదరిస్తూ పోషిస్తూ ఉండడం తన విధిగా తెలుసుకుంటే పత్రికా నిర్వహణం అంత కష్టంకాదు! పోటీపడి కొత్తదాన్ని ప్రారంభించే బదులు ఉన్నవానినే పోషించడం వివేకం.

మానవునికి వెలుగును, వికాసాన్ని, విజ్ఞానాన్ని, వివేకాన్ని చేకూర్చి సామాజికాభ్యుదయానికి తోడ్పడే బహువిధ సాధనాలలో పత్రికలు ప్రధానంగా గణింపదగినవి. ప్రపంచంలోని వివిధ ప్రాంతాల వార్తలద్వారా సమకాలీన చరిత్రను, విభిన్నానుభవాలను, ప్రకృతి వైపరీత్యాలను, భిన్న మనస్తత్వాలు గల వివిధ మానవుల స్వభావాలను, అనేక సమస్యలపైనను, సిద్ధాంతాలపైన వాదోప వాదాలను, ఒకటని ఏమిటి? లోకంలో జరిగిన జరుగుతున్న సమస్త విషయాలను మహత్తర దర్పణాల్లాగా ప్రతిబింబింప జేసుకొని వ్యక్తీకరించే యీ పత్రికలు మానవ దృష్టిని చక్కపరచి మానవత్వానికే ఒక విశిష్టరూపం ఇవ్వగల శక్తి కలవి. పత్రికలు నెరవేర్చవలసిన విధులు ముఖ్యంగా రెండు. ప్రజలలో విజ్ఞానాన్ని వ్యాపింపజేయడం; అద్భుతమైన ప్రచార సాధనంగా ఉపకరించడం.

అయితే యిప్పుడు మనకున్న పత్రికలలో అనేకాలకు ప్రచారదృష్టి, వ్యాపార దృష్టి హెచ్చుగా కలవై పోతున్నవి. రాజకీయ పక్షాల ప్రచారం నిమిత్తం, వ్యక్తుల- ముఠాల స్వార్థచింతా పరితృప్తికోసం ఈ పత్రిక లుద్భవిస్తున్నవనీ, వీటిలో ఇతర పక్షాల వాదాలు కాని, ఇతరవ్యక్తుల హితము గాని, విజ్ఞాన ప్రబోధకాలైన రచనలు గాని కన్పించడం లేదని

గమనించ గల్గుతాం. ఇవి ప్రజలకు విజ్ఞానభిక్ష పెట్టడం లేక పోగా, రాజస తామస గుణాల్ని పోషిస్తూ యువతీ యువకులను అంధకార కూపంలోకి త్రోసివేస్తున్నవి. అసభ్యమైన, వ్యక్తిగతమైన దూషణలతోను, వ్యంగ చిత్రాలతోను, వినుకలి జ్ఞానంతోను నిండియున్నవి. నీతి నియమాలంటే, ఆదర్శ సంప్రదాయాలంటే విశ్వాసమే నశించింది. భాషలో, భావాలలో, కథావస్తువులో ఏకోశానా నిగ్రహం, సంస్కారం కనిపించవు! విశృంఖలత్వం, అశ్లీలము, అసభ్యతా అన్నవి ప్రబలి పోతున్నవి. ధనార్జనమే ఎప్పుడు పత్రికల లక్ష్యమై పోయిందో, అప్పుడే - క్రాస్వర్డ్ పజిల్సు, నగ్న చిత్రాలు, తుచ్ఛ కామపోషకాలైన కథలూ, ధారాఫలాలు, సినిమా బొమ్మలు, క్రీడారంగం, దీర్ఘాలైన ప్రకటనలూ, అయినదానికీ, కానిదానికీ ప్రభుత్వాన్ని అసభ్యమైన భాషలో దూయబట్టడం అధికారులను వెక్కిరిస్తూ వ్యంగ్య (వాచ్య?) చిత్రాలను వేయుడం మొదలైన వాటికి పత్రికలలో సమధికమైన స్థానాలు లభించినై. వీటినన్నిటి వలనా ధర్మంపైన కన్నా అర్థకామాల మీద నేటి పత్రికలకు దృష్టి ప్రబలుతున్నట్లు గ్రహిస్తాము. కొన్ని పత్రికలు మానవునిలోని మానవత్వ దివ్యత్వాలను రూపుమాపి రాక్షసత్వానికి పట్టం గట్టుతున్నవని తెలుసుకుంటాము. ఈ పత్రికలలోని రచనల ద్వారా రచయితలు ప్రజాభ్యుదయానికి కాక ప్రజలలో అనైకమత్యము - అవిశ్వాసము - కాముకత్వము, స్వార్థకాంక్ష, ఘాతుకత్వము, అవినీతి, అశాంతి కల్గించి వారి పతనానికి హేతుభూతాలు కావడం శోచనీయం! ఈ దుస్థితినుంచి తప్పించడానికి ఆ పత్రికల్ని సంస్కరించ వలసి ఉన్నది.

ప్రజలు మూర్ఖచిత్తులనీ, జడులనీ అనుకొని పత్రికల ద్వారా తమ ప్రయోజనాన్ని సాధింప జూచుకోవటం అన్యాయం. తమతమ అభిప్రాయాలను, వైషమ్యాలను, అభిమానాలను, విరోధాలను ప్రజలపై పులిమి వారిని ఆటబొమ్మల్లాగా ఆడించవచ్చునని అనుకోవటం అవివేకమే అవుతుంది. ప్రజ అంటే ఆలోచనాశక్తి, వివేచనాశక్తిగల మానవ సమూహమే గాని జడపదార్థం గాదు! అజ్ఞుల్ని మోసగించడం విజ్ఞుల కర్తవ్యం కారాదు. సామాజికుల మనస్సుల్ని విద్యాదీప్తులతో యదార్థజ్ఞాన జ్యోతితో ఉత్తేజపరచి ప్రబోధించి ప్రయోజకుల్ని చేయడమే రచయితల పరమ ధర్మం.

ఇందుకు రచయిత లక్ష్యశుద్ధీ, చిత్తశుద్ధీ, బహువిషయ పరిజ్ఞానము, నిష్పాక్షిక విమర్శా కౌశలము, శిష్ట భాషాధికారము, శాంత చిత్తత, ఆదర్శ శీలంపైన దృష్టి కలవాడై ఉండాలి. ఏసమస్యనైనా, ఏవార్తనైనా యదార్థ దృష్టితో, సమ్యగ్రీతిని పరిశీలించి దాని పుట్టు పూర్వోత్తరాలను వివిధాంశాలను ఎరుకపరచి వదలివేయవలెనేగాని రచయిత ప్రజాభిప్రాయాన్ని తన పాక్షిక వ్యాఖ్యానంతో కలుషితం చేయటం మంచిది గాదు. ఉద్రేకపూరితమూ, అతిశయోక్తియుతమూ అయిన రచనలు పత్రికలలో ప్రవేశింపరాదు. పత్రికలు ప్రజలకు భాషాధికారాన్నిగూడా చేకూర్చవలె గనుక శబ్దస్వరూపము, ఉదాత్త పదజాలము, పలుకుబళ్ళు- నానుళ్ళు, వాక్య నిర్మాణ క్రమము, శైలీసంపద మొదలైన వాటిపైన రచయిత దృష్టిగల్గి ఉండాలి. అనువాద వ్యాసాలలో అన్యభాషా ధోరణులు కనిపించకుండా

వ్యావహారిక భాషాప్రయోగ సందర్భాన భిన్న మాండలికాల్ని గ్రహిస్తూ విషయ విపులీకరణమే ప్రధానాశయంగా రచనలు సాగవలెను. విపరీతంగా ధనం ఆర్జించవచ్చుననీ, సులభంగా పేరు తెచ్చుకోవచ్చుననీ రచయిత ఇతరులకు అమ్ముడుపోయి వ్యక్తిత్వాన్ని గోల్పోరాదు. మార్గదర్శి కాదగిన అధికారి తన అజ్ఞులైన అనుయాయుల స్థితికి దిగిపోతే, గుఱ్ఱం గాడిదె సమానమై, లోకం నిర్గతికమైపోతుంది. అలాంటిప్రమాదం జరక్కుండా రచయితలు దీక్షవహించి వివేకంతో, విశాలహృదయంతో స్వీయకర్తవ్య నిర్వహణంలో జాగరూకులు కావడం ఈ నాడెంతో అవసరం. పత్రికలు సంస్కృతీ నిలయాలుగా రూపొందడానికి విజ్ఞులు పూనుకొని ప్రజాభ్యుదయానికి, ప్రపంచ శాంతికి తోడ్పడవలెనని నా మనవి.

[గుంటూరు నుంచి వచ్చెడి 'శాంతి' అనే వారపత్రికలో
(27-9-1952) ప్రచురింపబడినది.]



# సినిమాలు - బాధ్యతలు

సినిమాకోసం నెలజీతంలో ఒకభాగం ఎడంగా ఉంచడం అనేది గృహస్థధర్మం యీరోజుల్లో. పోతన్న గనక యీ యుగంలో భాగవతం వ్రాసిఉంటే తన రుక్మిణీకల్యాణంలో— "సంతుష్టు డీ మూడు జగముల.........తన యింటగల సర్వధనము నైదు భాగంబులుగా విభజించి........." అనే పద్యానికి సినిమా ఇండెంటుకూడా చేర్చేవాడే ప్రత్యేకంగా —అని చెప్పాలి మనం! తండ్రికొనుక్కు తినమని ఇచ్చిన డబ్బుల్ని పిల్లవాడు సినిమాకోసం వినియోగించడం నేటికాలపు ధర్మం. హాస్టలు విద్యార్థులు ప్రత్యేకంగా శనివారాలు సినిమా కోసం వాళ్ళకు మామూలుగా ఉండే అటెండెన్సును మాన్పించి, వార్డెను నడిగి అనుమతి పొంది స్పెషల్ బస్సు ట్రిప్పు వేయించుకోడం న్యాయం. చుట్టంగాని, స్నేహితుడుగాని వస్తే భోజనాది సౌకర్యాలతో పాటు సినిమాకు వెళ్ళడం కూడా కలపంది మర్యాదకు లోటేమో! కొత్తగా వివాహమైనప్పుడు తన భార్యను ఎన్నిమాట్లు సినిమాకు తీసికెళ్ళితే అంత మంచివాడౌతాడు భర్త! చూశారా! సినిమాకు మనలో ఎంత ప్రాముఖ్యం అబ్బిందో ? కూలిచేసుకొని బ్రతికే జీవికూడా సినిమా అంటే ఆదరించేవాడే. భర్త చనిపోగానే వెనకటిపద్ధతులలో వికృతాకారం దాల్చేవారికి (ఆనందదాయకమైన విషయాల జోలికి పోగూడదనే అర్థం సూచించే ఆకారం దాల్చి) కూడా సినిమా అక్కర్లేదంటే చెప్పట్టుకు కొడ్తారు, ఎందుకు చెప్పవచ్చానంటే సినిమా అందరిచేత- విద్యాధికులు, అజ్ఞులులనీ, భాగ్యవంతులు పేదవారనీ, పిన్నలు పెద్దలనీ విచ

క్షణ లేకుండా— ఆదరింపబడుతున్నది. ఇంచుమించుగా సినిమా దినచర్యలో ఒకటి అయిపోతున్నదన్నా సత్యదూరంకాదు.

సినిమాలో నటించడంకన్న మించిన గౌరవంలేదు. మొదట్లో నాటకాల్లో నటిస్తున్నాడంటే ఒక రౌడీఅని ఎల్లా మనసంఘంలో అనుకునేవాళ్ళో, సినిమాలు మొదలెట్టిన కొత్త రోజుల్లోకూడా అందులో నటించినవారికి చెడ్డ పేరాపాదిస్తూ వచ్చారు. కాని నిరుద్యోగసమస్య ఎదుర్కొన్న మనవిద్యాధికుల కీ సినిమా లొక ఆధారం చూపించినై అని ఒప్పకోక తప్పదు. అంతకుపూర్వం నాటకాల్లో పేరుపడ్డవాళ్ళు మొన్న మొన్నటి దాకా నటిస్తూవచ్చినా వీటిల్లో యువకులకు స్థానం లేకపోలేదు. నిజంగా మన తెలుగుదేశంలో ఒకనాడు ఉన్నత శిఖరాలను అందినట్టి కళలన్నీ మళ్ళీ సినిమాద్వారా మనం చూడగలుగు తున్నాం. 'భరతనాట్యం' అంటే అదివరకు ఎరగనివాళ్లు సినిమామూలకంగా చూడగలిగారు. 'బొంబాయి తమాషా' వీధిభాగవతం— పురాణం— బుర్రకథ— సోది— చూశారు. ఈ విధంగా ఎన్నో మళ్ళీ పునరుద్ధరింపబడినై. నాటకాలకులేని ప్రోత్సాహం సినిమాలకు అబ్బింది. నాటకాలకు రాని ధనం సినిమాలకు వస్తున్నది. నాటకాలకు రాని ప్రేక్షకులు సినిమా లకు వస్తున్నారు. నాటకం వేసి పేరు త్వరగా సంపాదించుకోలేక పోయినా, సినిమాలో నటించి పేరు సంపాదించుకుంటున్నాడు నటుడు. నాటకంవ్రాసి ఎవ్వరికీ తెలియకుండా ఏ మూలనో ఉండే రచయిత సినేరియోవ్రాసి స్క్రీనుమీదికి ఎక్కు తున్నాడు! చూశారా సినిమాల ప్రచారం! అందు మూల ముగా అబ్బుతున్న ఆధిక్యతలను గమనించండి!

ఇక, సినిమా పరిశ్రమకోసం మన దేశంలో ఎంతఖర్చు అవుతున్నదీ విచారిద్దాం. హిందూదేశం ఫిలిం పరిశ్రమలో ఇంతవరకు పదిహేడుకోట్ల రూపాయలకు ఎక్కువే ఖర్చుపెట్ట బడింది. ఊళ్ళవెంబడి తిరిగే సినిమాలు కలుపుకుంటే 1,300 సినీమాలు మన దేశంలో వ్యాపించిఉన్నై. ఫిలుంలను తయారు చేసే కంపెనీలు నలభై; సినిమావిషయిక సంచికలు, పత్రికలు ఏనభై అయిదున్నూ ఉన్నాయి. ఈనాటికింకా ఎక్కువే పత్రికలసంఖ్య ఉంటుంది. అందుకు ఉదాహరణం మన తెలుగులో సినిమాసంచికలే. ప్రతిసంవత్సరమూ, హిందూ దేశ ఫిలిం పరిశ్రమకు 40 లక్షల రూపాయిల "రాఫిల్ము" కావాలట. యంత్రాలకూ తదితర పనిముట్లకూ సంవత్సరానికి 20 లక్షల రూపాయలు ఖర్చుఅవుతున్నాయి. సంవత్సరానికి 200 సినిమాల ప్రకారం మన దేశం యీ పరిశ్రమకు 2,00,00,000 రూపాయలు వెచ్చింపబడుతున్నాయి! సంఖ్యల్ని చూస్తే ఆశ్చర్యము కలుగవచ్చు నిజమే! కాని అంతడబ్బు ఏ విధంగా సమకూడుతున్నదో ఒకనిముషం ఆలోచించాలి. దానికి మనకు వస్తూన్న ఫలితం గమనించాలి. (పై లెక్కలు ఒక పుష్కరంనాటివి. ఇపుడు బాగా వృద్ధిపొందినై సుమా.)

పరిశ్రమలన్నిటిలో సినిమా పరిశ్రమే యీ రోజుల్లో పేరెన్నికగన్నది. ఇది తదితర విషయాలమాదిరి ఒకేవైపు కాంక్ష ఉన్నదికాదు. వ్యాపార విషయికమే కాదు, కళా విషయికముగూడ. మిగిలిన పరిశ్రమలలో వ్యాపార కాంక్షే గాని కళావిషయ మసలు లేనేలేదు. కాని, సినిమాలో కళా విషయము మిళితము కావడం వల్లనే వచ్చింది దానికి గొప్ప

దనం, సర్వజనాదరణమున్నూ. అదివరకు వ్యాపారులకున్నూ, కళావేత్తలకున్నూ అట్టే సంబంధం లేనిదల్లా, యీనాడు సినిమాపరిశ్రమలో సంబంధం గాఢంగా ఏర్పడాల్సి వచ్చింది. మొదట్లో బెరుకుగా ఉండవచ్చు. డబ్బు ఖర్చు కాకూడదని వ్యాపారరీత్యా మాట్లాడవచ్చు. కళను తిరస్కరించినట్లు కాదా అని కళావేత్తలు గోల పెట్టవచ్చు. అయినా ఏ రికి వురికీ సామరస్యం క్రమేపీ కుదరాలి. ఏనాడు కుదురుతుందో అప్పుడు సినిమా కొంతమట్టుకు దారి కొచ్చిందన్నమాట. మనకు తయారయిన తెలుగు చిత్రాలలో వీని సామరస్యం ఎల్లా కుదిరినాయో గ్రహింపదగును. వ్యాపారరీత్యా హాస్యరసం ప్రవేశ పెట్టడానికి ప్రయత్నించడం. కళాదృష్టిలో, ఆ హాస్యము "శ్రుతిని మించి రాగాన పడినట్లుగా" కనబడడమూ! అసలు కళాదృష్టితో మన ఫిలుములు తీయడం లేదని గొప్పగా తయారు చేయాలని పోయి జనసామాన్యానికి రుచింపక వ్యాపారరీత్యా దెబ్బతిన్న సినిమాలున్నాయి. వాటి పేర్లు ప్రేక్షకులే గ్రహించుకో గలరు! కళా వ్యాపారములను రెంటినీ సమానంగా దృష్టిపథంలో పెట్టుకొని ఉండాలి నిర్మాతలు.

నిజంగా ఇంతగా ప్రజాదరణపొందిన యీ పరిశ్రమను సార్థకపరచుకోడం మనధర్మం. సామాజికుల నందరినీ తృప్తి పరచాలి సాధ్యమైనంతవరకు. నటకుల్ని పోషించాలి మరీ విపరీతంగా కాకుండా. వ్యాపారానికి భంగం కల్పించకుండాను, కళకు భంగం వాటిలకుండా, ఔచితిని పాటిస్తూ నిర్మించాలి చిత్రాల్ని. ఈ పరిశ్రమకు తోడుపడుతున్న ప్రతివ్యక్తికీ

మనం మర్యాద చూపించాల్సిన బాధ్యతఉంది. ఈ బాధ్యతల్ని దిఙ్మాత్రంగా సూచిస్తాను.

సినిమాకు తోడ్పడే విషయాలేమిటి? ఈప్రశ్నకు జవాబు- సినిమాకు తోడ్పడని విషయమేలేదు- అని చెప్పాలి. ఎందుకంటే ప్రతి అల్పవిషయము, జీవితానుభవాలలోని ప్రతి చిన్నఅంశమూ గమనింపతగ్గదే. స్థూలంగా చెప్పాలంటే, దర్శకుడు, కవి, నటీనటులు, కెమెరామెన్, సౌండు రికార్డర్, మేకప్-సెట్సుకు సంబంధించిన ఆర్టిష్టులు, ప్రేక్షకులు ముఖ్యాంగాలు. వీరందరికీ కళాదృష్టి అవసరం. కేవలం వ్యాపారరీత్యా ఉండకూడదు. అంటే దర్శకుడు మొదటినుంచీ ఆదాయంపైన దృష్టిపెట్టుకొని ఉండకూడదు. కవి మంచి గద్యపద్యాన్ని వ్రాసిపెట్టడానికి కేవలం పైసా ప్రధానంకాగూడదు. నటుడు నటించడం కాంట్రాక్టుమీద అయినా నటించినంతసేపూ అది మరచిపోవాలి. ప్రేక్షకులు సైతము, చేతనైనంత మటుకూ సహాయం చేయాలి. ఆర్థికంగానూ, కళాభివృద్ధిలోనూ, వీరంతా సమర్థులై ఉండడానికి విద్యావంతులై ఉండాలి. అనుభవజ్ఞులై ఉండాలి. వ్యాపారవాంఛ, ధనముపై కాంక్ష ఏవిధంగాఉందో అల్లాగే కళాతృష్ణ, తత్సాధన వీరిలో అగుపించాలి. ఇవన్నీ ఇందరిలో ఏకీభవించినప్పుడే చిత్రము సార్థకమౌతుంది.

కేవలము విద్యావంతుడైనంత మాత్రాన ప్రయోజనము లేదు. విషయగ్రహణకై విద్య అవుసరము. అంతే కాని, గొప్ప చదువులతో—(అనుభవములేని)— అక్కర ఉండదు. అనుభవజ్ఞులే బాగా పనికివచ్చేవారు. ముఖ్య

ముగా దర్శకుడు అన్నిటాఉండాలి. అంటే, తాను నటుడై కవియై, ప్రేక్షకుడై ఉండాలన్న మాట. ఇది కేవల మసంభవముగా, అవివేకముగా అగపడవచ్చును. కాని రహస్యమందులోనే ఉంది. ఏమిటంటే, దర్శకుడు నటుడు వాచ్యంగా (Literally) కానక్కరలేదు. అట్లాగే తదితరాలు. కాని ఆయాపనుల్ని నెరవేర్చగలశక్తి ప్రచ్ఛన్నంగా, నిగూఢంగా ఉండి ఉండాలి. ఆ విషయాల్లో లోపాలను సరిజేయగలిగి ఉండాలి. అంటే విచక్షణాశక్తి, విమర్శనాదృష్టి కలిగి ఉండవలెనన్న మాట. అతిచురుకుగా ("Sensitive") ఉండడం అతని ప్రకృతై పోవాలి. వీటిఅన్నిటికి పైగా నిర్వాహణాశక్తి అలవడంది లాభం లేదు.

కవి అనంగానే ఊహాసౌధాల్లో విహరించేవాడనికాదు. సినిమాకై ప్రత్యేకమైన వరవడి కలిగిన కవిఅని అర్థం. లోకానుభవాలు సూక్ష్మంగా పరికించిఉండాలి. వివిధరుచులకు అనువర్తించేట్లుగా రచించాలి. ప్రకృతిని–తన పరిసరాన్ని— మరచిపోకుండా, రసోచితమైన సంభాషణలతో ముక్తసరిగా, అనవసరమైన తావుల్లో పద్యాల్నీ పాటల్నీ చొప్పించకుండా– స్వాభావికంగా రచన సాగించడమే అతనిధర్మం. అర్థంచేసుకోవాల్సిన ఘట్టాలు– అసభ్యమైనవి– బహిరంగంగా చూపెట్టే రచనల్ని తగ్గించుకోవాలి. దీర్ఘంగానూ, విసుగుపుట్టించేలాగు కథను పొడిగించకుండా, "Recreation, కై ఉపయోగపడే "సినిమాలకు" ఆ రచన అని మరచిపోగూడదు.

నటుల విషయం గమనించాల్సిందే. నటీ నటుల్ని ఏరుకోవడమనే ప్రథమ కర్తవ్యంలో లోటు జరుగుతూనే ఉంది. పాత్రలకు తగిన నటీ నటుల్ని మొదట వ్యయ ప్రయాసలని మానకుండా ఏరుకోవాలి. తరువాత దర్శకునిచేత ప్రదర్శనాలలో తరిఫీదు పొందాలి. కాలము వ్యయమై పోతున్నదని తలంచకూడదు. ఎంత ఆలస్యంగా చిత్రం తయారయితే అంతఫలం దక్కుతుంది. కళావిషయంకాబట్టి జాగ్రత్తగా సాధ్యమైనంతవరకు సంపూర్ణత్వం (Perfection) కోసం ప్రయత్నించాలి. ప్రతి విషయంలో ఔచితి ఎంతవరకు పాటించాలో స్వానుభవమువల్ల తెలుసుకొని ప్రదర్శించాలి. అనుభవజ్ఞుల సలహాలూ విమర్శలూ గ్రహించడం తప్పుకాదు.

ప్రేక్షకుల కర్తవ్యం ఏమిటి అంటారేమో. చూసి ఆనందించడమే కాకుండా, లోపాలోపాలను గుర్తించి పత్రికాముఖానో లేఖలద్వారానో వ్యక్తీకరించడం కూడా. విమర్శన కళాభివృద్ధికి తోడ్పడుతుంది. ఈ విమర్శనాశక్తి అలవడడం సుసాధ్యంకాదు. అంటే మనంచేస్తున్న విమర్శనమటుకూ విమర్శకాదా? కాదు. అది కేవలము పక్షపాత ప్రేరేపితమే. ఆ విమర్శన వివిధ కోణాలనుండి గమనింపబడినదై ఉండాలి. సినిమా విమర్శకుడు సైతము కొంత పరికర సమన్వితుడై ఉండాలన్నమాట. ఆ టెక్నిక్ తెలిసినవాడై ఉండాలి. అప్పుడే అతని విమర్శ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడినది అవుతుంది.

సినిమా పరిశ్రమ కోసరం ఇంతఖర్చు పెట్తూన్న మన దేశం పరిపూర్ణత్వం పొందేటట్లు చూడడం మనవిధి. కాబట్టి కళావేత్తలూ, కవివర్యులు, విద్యాధికులూ, నటీనటులూ, సినిమా ప్రపంచంతో సన్నిహిత బాంధవ్యం కల్పించుకొని, తత్పరిశ్రమాభివృద్ధికై ప్రయత్నించాలన్న మాట మరవ కూడదు !

[మద్రాసు నుంచి వచ్చేడి 'పెంకిపిల్ల' అనే మాసపత్రికలో
ఏప్రిల్ 1941 లో ప్రచురింపబడింది.]



# సంస్కృతము - భారతీయత

## ౧

సంస్కృత సాహిత్యము భారతీయ సంస్కృతికి ప్రతి బింబము; భారతజాతి కది వెన్నెముక వంటిది; భారతీయ విజ్ఞానమందు నిక్షిప్తమైయున్నది. 'సంస్కృత'మను శబ్దమే విలక్షణమైనది. ఆభాష సంస్కరింపఁబడినది. అందలి సాహిత్యమువలన, శాస్త్రములవలన, మానవులుత్తమసంస్కారమును బొందఁగల్గుదురు; ఆత్మ వికాసము నందఁగలరు. అయ్యది సత్యాన్వేషణమునం దఖండ ప్రతిభాశాలురు, తపస్సంపన్నులునైన ఋషుల సంప్రదాయానుగుణమైనది. మహా వ్యుత్పన్నుల పరిశోధనా ఫలితముగను, దార్శనికోత్తముల ప్రవచనముద్వారా, భారతీయ విజ్ఞానము విశిష్టమై నిలచినది. ఋషుల హృదయములు విశాలములైనవి. వారి దృష్టులు నిశితములైనవి. వారభిలషించినది జగత్కల్యాణము. "సర్వేజనాః సుఖినోభవంతు" అనెడిదే వారి మకుటము !

మున్ముందు మానవుని జంతు ప్రకృతినుండి తప్పించుటకుఁ బ్రయత్నమొనర్చి యనంతరము మానవుని వివేకముచే విలక్షణునిగాఁ దీర్చి దిద్దుటకై మన ప్రాచీనులు బూనుకొనిరి. మానవత్వము వివేకముచేఁ బ్రకాశవంతముకాగా, దివ్యత్వముపై జిజ్ఞాసను ప్రేరేచిరి. ఇట్లు రజస్తమోగుణముల క్షాళనమొనర్చి, సత్త్వగుణమును బ్రకాశిలఁ జేయుట భారతీయ విజ్ఞాన లక్ష్యము. ఆదర్శములకై యత్నించుటకు ననాదర్శములఁ బరిహరించుటకును వలయు సాధన సామగ్రిని -

జేకూర్చియు మన ప్రాచీనులు మన కొసంగియున్నారు. దీనినీ వెన్నంటి వచ్చినవే పుణ్యప్రీతి; పాపభీతియనునవి. దైవభక్తి ప్రత్యణువున భారతదేశమందుఁ బరివ్యాప్తమై యున్నదనుట సత్యము. విగ్రహారాధనము, గోపావిత్ర్యము, ధర్మజిజ్ఞాస, సంప్రదాయ గౌరవము, వేదప్రామాణ్యము మున్నగునవి భారతీయ సంస్కృతికి విలక్షములైనవి.

పై నుల్లేఖించినవన్నియు సంస్కృత సాహిత్య శాస్త్రములందుఁ బ్రతీయమానమగు ధర్మములే.

సంస్కృతములో ముఖ్యముగా మూఁడద్భుతవిషయ ములు గోచరింపఁగలవు: 1) కావ్య ప్రమేయమందలి రస విచారము, 2) బ్రహ్మ జిజ్ఞాసలోని యానందము. 3) వాఙ్మయమందంతట నంతర్వాహినిగా ప్రవహించు నయబోధ. రసము, ఆనందము, నీతి యనునవి భారతీయుల జీవితము లలో నెంతగాఁ బెనవేసికొని పోయినవో సూక్ష్మముగాఁ బరిశీ లించినఁ దెలిసికొనఁగలము. ప్రతి భారతీయాచార వ్యవహార మందు నీ త్రికము గోచరింపఁగలదు!

స్థాయీ భావములనుండి రసప్రతీతికి మధ్యనున్న వివిధాంతస్థులను విచారించుటను జూచినఁగాని, అలంకార విచారమందుఁ దచ్ఛాస్త్రజ్ఞులు జేసిన సూక్ష్మాతి సూక్ష్మ పరిశీలనమును విలోకించినఁగాని, పిపీలికాది బ్రహ్మపర్యంత మున్న ప్రకృత్యనుశీలన మందలి నిశితదృష్టినిఁ బరికించినఁ గాని నేటి నాగరకు లబ్బురపాటు వహింతురనుటలో విప్రతి పత్తి యుండదు.

ఆధ్యాత్మిక సంపత్తిని చేకూర్చుకొనిన భారతీయుఁడు వృద్ధుఁడగును. ఇతరజాతులవారికి భిక్షపెట్టగలిగినస్థితి భారతీయుల కొక్క ఆత్మవిచార ప్రకరణమందే కలదు. ఏత జ్జిజ్ఞాసయందే భారతీయుఁడు తదితర ప్రపంచజాతీయులలో విలక్షణుఁడు; ఉన్నతుఁడును. అట్టి వైశిష్ట్యమును నిలుపుకొనుటకు సంస్కృత భాషా పరిచయము, సంస్కృత సాహిత్య పర్యాలోకము, సంస్కృతశాస్త్ర పాండిత్యము లత్యంతావశ్యకములు.

సర్వజాతి సంస్కృతులును సాంకర్యము పొంది భాసించుచున్న యీ కాలమున భారతీయ సంస్కృతిని ప్రత్యేకముగా నిలువరింపఁ బూనుకొనుట యవివేకముగా గోచరింపవచ్చు. అది దుస్సాధ్యముగా గన్పింపను వచ్చును. కాని అయ్యది భ్రాంతి మాత్రమే. విముక్త భారతావని విశిష్టముగా, ఆత్మ బలముతో తిరిగి ప్రశస్తి వహించుటకు కృషి యొనర్ప భారతీయులెల్లరు దీక్షగొన్నచో నయ్యది సులభ సాధ్యమగును. దీనికి సంస్కృత భాషాభ్యాసనమే ప్రథమ సోపానము!

[ విజయవాడ నుంచి వచ్చుచున్న "జాగృతి" అనే వారపత్రికలో (11-11-1955) లో ప్రచురింపబడింది.]

✱

# సంస్కృతము - భారతీయత

౨

సంస్కృత భాషను నిర్బంధంగా చేయటం ఎంతైనా అవసరం. విద్యార్థులకు భావం ముఖ్యం అనుకుంటే ఆంధ్ర ముఖ్యమంత్రి సూచించినట్లుగా తెలుగు, సంస్కృతము పరస్పర పరిపూరకాలుగా తీసికొని తెలుగునకు 70 మార్కులు, సంస్కృతానికి 30 మార్కులు ఉంచవచ్చు. నీదగ్గర విదేశీ సంస్కృతీ ఉండవచ్చు కాని విదేశీయులు నీవద్దకు వచ్చినపుడు నీవు చూపగలిగే నీస్వంత ప్రతిభ యేది ? భారతీయతగదా ! నేను అన్నిటినీ గ్రహిస్తాను. కాని నా భారతీయ సంస్కృతిని మాత్రం మరువను. విదేశీయులు నీ దేశంవచ్చి నేర్చుకోదలిస్తే నీవు నేర్పగలిగేది మళ్ళీ విదేశీ సంస్కృతిగదా ! అది అతనికి ఉన్నదే ! భారతీయుల్లోని మహాత్మ్యాన్ని పొందుదామని వచ్చిన విదేశీయునికి, ఈ సంస్కృతజ్ఞానం, భారతీయ వైశిష్ట్యం లేకపోతే నీ వందించగలిగేది పూజ్యం. విదేశీయులు నీవద్ద నేర్వవలెనన్నా నీవు భారతీయుడవై యుండాలి. నీ పూర్వులు ఎంతటి మహాత్కార్యాన్ని సాధించారో తరచి చూడాలంటే సంస్కృతం అవసరం. ఇప్పటి విద్యాభ్యాసంవల్ల మనం ఆంగ్ల మనస్తత్వంతో అటమటిస్తున్నాం. ముందుతరాల వారైనా మేం భారతీయులం, మా భారతీయ విజ్ఞాన భాండాగారం అనంతమైంది అని మహోన్నత శృంగాలపైనుంచి మహనీయంగా ప్రవచింప గలగాలంటే వారికి సంస్కృత భాషా పరిజ్ఞానం అత్యవసరం. ప్రధాని నెహ్రూకున్న ప్రతిభా ప్రజ్ఞలకే

కాదు అతనికి లభిస్తున్న స్వాగతాలు, ప్రణామాలు. ప్రాచీన భారతీయ సంస్కృతి దానికి కారణం. ప్రతి విదేశీయుడు ఇప్పుడుకూడా ఉత్కృష్టమైన సిద్ధాంతాన్ని భారతీయుని వద్ద నుండి కాంక్షిస్తున్నాడు. కనుక మా ముందుతరాలవారు విశ్వంలో విశిష్ట స్థానాన్ని పొంది భారతీయ సిద్ధాంతాల్ని ప్రవచించాలంటే సంస్కృతం అవసరంలేదా ? కనీసం మా ముందుతరంవారు మనవైభవం ఇంతటిదని తెల్సుకొనడానికైనా సంస్కృతం అవసరం– ఎందుకంటే భారతీయ సంస్కృతి సంస్కృత భాండారంలోనే ఉన్నది ! కనుక ప్రతివిద్యార్థి సంస్కృతాన్ని నిర్బంధంగా పఠించాలి. భారం అంటారా ? తెలుగు భారంకాదా ? సంస్కృతం కష్టం అంటున్న ఈ ప్రబుద్ధులకు వారు వ్రాస్తున్న తెలుగే ఉత్కృష్టమైందని అభిప్రాయమా ? తెలుగులో నేర్వవలసింది, సాధనచేయవలసింది ఎంతో ఉంది. కాని మనకు వచ్చిందిచాలు, అదే ఒకఘనత అనుకొని సంస్కృతం మనకు రాదుగనుక వద్దనటం అసమంజసం– ఈ సంస్కృత వ్యతిరేకవాదులకు ఇందుమూలంగా ఒకసవాలు– తత్సమ పదాలు లేకుండా, అచ్చ తెలుగులో వారిని ఒకవ్యాసం వ్రాయమనండి. అప్పుడు వారెంత కష్టపడవలసి వస్తుందో? అన్నిటిలోకన్న ఆంధ్ర ప్రభలోనే సంస్కృతపద ప్రయోగం విరివిగా ఉంటున్నది. సంస్కృతాన్ని పూర్తిగా వినియోగించుకుంటూనే వద్దనటం అవివేకం! ఒక భాషసాధన చేయవలసింది గాని కష్టమని నెట్టివేయవలసింది గాదు! సంస్కృతం నిర్బంధం చేసి ఆంగ్లాన్ని ఐచ్ఛికం చేయవచ్చు. సాంకేతికపదాలన్నీ సంస్కృతంలోనే ఉన్నవి. లేనివి కూర్చటం జరిగింది. జరుగు–

శోంది. వాటిని పునఃపరిశీలించి పరిష్కరణ తరువాత భద్రపరుప వచ్చు- ఈ సాంకేతిక పదాలు తీసుకొనవలసింది, అన్ని భాష ల్లోనూ అంతర్వాహినిగాఉన్న సంస్కృతంలోనుంచే. ఒకపదం నిర్ణయించాలన్నా, నిర్ణయించింది అర్థం చేసుకోవాలన్నా భాషా పరిజ్ఞానం అవసరం- ఎలాగూ సాంకేతికపదాలు సంస్కృతం నుంచి గ్రహిస్తే ఆంగ్లం ఆవశ్యకత అంతగా ఉండకపోవడమే గాక విద్యాబోధన మాతృభాషల్లో జరిగే అవకాశం ఉంటుంది. భాష మృతం ఎలాఅవుతుంది? ప్రతిభాష సజీవమైన భాషయే. ఇన్ని భారతీయభాషల్లో సర్వత్రా సంశోభిల్లుతూన్న భాషను మృతభాషని ఎలా అనగలం! దృష్టిభేదంవల్ల ఆ పదం ఉత్పన్నం అవుతున్నది.- గ్రామజీవనం సాగిస్తున్న రైతుకి ఆంగ్లంకూడా మృతభాషే. నిర్లక్ష్యం చేయబడిన సంస్కృతం ఈ అధునాత నులకి మృత భాషకావచ్చు! వారికిరాదుకాబట్టి- కాని మేం ప్రతినిత్యం దాన్లో అధ్యయనం చేస్తునే ఉన్నాం. ఏ భాష కూడా మృతభాషకాదు- సంస్కృతభాషలో వేదవేదాంగాలు జపతపాలు మాత్రమే కాదు. అది అందులో ఒకభాగం మాత్రమే- సంస్కృత విద్యాభ్యాసం అంటే పాతకాలానికి పరుగులుతీయడ మంటున్నారు. ఈ నవనాగరిక కాలంలో మ్రగ్గిపోయేకన్న పాతకాలాలకు పరుగులు తీయటమే మంచిది. అంటే ఈకాలంలో మంచిని గ్రహించము అని కాదు. ఇది గ్రహిస్తూనే ప్రాక్తన వైభవాన్ని మనస్సునందుంచుకుంటాం. పాతకాలానికి పరుగులుతీయడమంటే చెపుతున్నాను. మూడు వేల సంవత్సరాలనాటి మొహెంజొదారో, హరప్పాల నాగరి కతకు నేనుపోవడానికి ఏమీసిగ్గుపడను. ప్రతి భారతీయుడు

అలాగే మూడువేల సంవత్సరాలు వెనుకకు వెళ్ళినా ప్రమాదం లేదు. అందుచేత సంస్కృతాభ్యాసం చేయనక్కరలేదనీ, అది ఒక వర్గానికి చెందిన భాషఅనీ ఆవర్గాధిక్యం సంస్కృతభాషా పోషణం వల్లా, తద్భాషాభ్యాసంవల్లా, కల్గుతుంది అనీ భయపడడం అవివేకమే అవుతుంది.

[విజయవాడ నుంచి వచ్చుచున్న 'జాగృతి' అనే వారపత్రిక వారేర్పరచిన 'ఇంటర్వ్యూ'లో చెప్పింది.]



# అర్థిత్వం - విద్యార్థులు

అర్థించడం చాల అవసరం; ఎవరినీ, ఏమిటీ, ఎందుకూ అర్థించడం అనే ప్రశ్నలు వెంటనే ఉద్భవిస్తాయి. "అడగందే అమ్మైనా పెట్టదని" సామెత ఉండనే ఉంది కదా! కనుక అడగడ మంటూ అడగకలిగి ఉండాలి. ఇందుకు మనస్సులో ఆతురత మంటూ పొడమి తీరాలి. ఆకాంక్ష కలిగిన తర్వాతనే అర్థించడం జరుగుతూ ఉంటుంది సామాన్యంగా. తనమనస్సులో జనించనట్టి అభిలాషను పురస్కరించుకొని అడిగే అభ్యర్థనం ఆత్మశుద్ధి లేనిది గనుక అది అతుకు పెట్టినట్లే ఉంటుంది. ఒకరడగమన్నారు గనుక అడుగుతున్నాడే కాని తనంతట తాను అభినివేశం కలవాడై అర్థించడం లేదుగా! అంచేతనే, స్వాభిలాష ప్రేరితమైన అభ్యర్థనానికి పరప్రేరితమైన వేడికోలుకూ హస్తిమశకాల కున్నంత భేదం వుంది!

ఆకలి గొన్నవాడు భోజనం అర్థిస్తాడు; కష్టంలో ఉన్నవాడు కరుణకోసం అర్థిస్తాడు; వయసు మీరిన కారణాన వృద్ధులు సహాయాన్ని అర్థిస్తారు. నిరుద్యోగి అర్థిస్తాడుద్యోగాన్ని. పేదవాడు భాగ్యాన్నీ, ప్రేయసీ ప్రియులు ప్రేమనూ, ఎన్నికలలో నాయకుడు ఓట్లనూ, అనపత్యులు సంతానాన్ని, రోగి ఆరోగ్యాన్నీ, జిజ్ఞాసువులు ఆనందాన్నీ ఇలా ఈలోకంలో ఎందుకో ఒకందుకు ఎవరినో ఒకరిని అర్థించని వాడంటూ లేడనే చెప్పవచ్చు.

కామంపైన దృష్టి యీ సృష్టిలో ఎంత గాఢంగా పాతుకొని పోయిఉందో స్పష్టమౌతూనే ఉన్నదిగదా! కామ్యా

నికీ జీవికీ అంత అవినాభావ సంబంధమే! మరి అయితే నిష్కామంగా కర్మను చేయాలంటాడే శ్రీకృష్ణ పరమాత్మ గీతలో; అది ఎలా సాధ్యమూ అని ప్రశ్న! సృష్టితోనే కామం - కోరిక - జనించిందే. దాన్ని విసర్జించడం తేలిక అయినపనా? కనుక నిష్కామకర్మ అనేది పలికినంత సులభం కాదు; అది కష్టసాధ్యం. అందుకే సాధన అవసరం అనడం.

కామాన్ని సంపూర్ణంగా అనుభవించిన తర్వాత విరక్తి అంటూ కల్గుతుందని అనుభవజ్ఞు లంటారు. నిషేధించినంతసేపూ ఆ వస్తువుపైన కాంక్ష యినుమడిస్తూనే ఉంటుంది. మనకు విధినిషేధాలంటూ ఏర్పడి ఉన్నాయి గదా. ఇవి జీవిపైన అధికారం చలాయిస్తూన్నంత కాలమూ స్వేచ్ఛ లేదు. అభిలాష, ఆకర్షణ, ఆశ లనేవి సహజాలు. వీని నాకట్టితే అవి ద్విగుణీకృతాలవుతూ ఉంటాయి. వాటిని తృప్తి పరుస్తే క్రమంగా వాటి తీవ్రత తగ్గిపోవచ్చు; ఉపశమించవచ్చు. వాటి యెడల రక్తి క్రిమేపీ క్షీణించి చివరికి మనసు విరక్తి వేపు మొగ్గవచ్చు. అందుచేతనే "కామిగాక మోక్ష గామి కాడ"ని వేమన్న పల్కింది సత్యం!

అయితే పై అభిప్రాయాల ననుసరించి చూస్తే యీనాటి విద్యార్థులలో పెక్కుమంది వైరాగ్యానికి దారితీసే అలసత్వం కల్గి ఉన్నారేమో అని సందేహం వేస్తుంది. వెనుక అర్థిత్వాన్ని విచారించిన విధంగా - విద్యార్థి విద్యను అంటే జ్ఞానాన్ని అర్థించే వాడన్నమాట! అయితే అర్థించడం సహజాభిలాషతో వర్ధిల్లుతున్న దనుకున్నాం. విద్యార్థి విషయంలో పూర్వ కాలంలో విద్యార్జనాభిలాష గాఢంగా ఉండి

నట్లు తెలియగలం. కాని ఇటీవల రాను రాను ఆ అభిలాష పోషకులదీ - తల్లి దండ్రులదీగా ఉన్నదే కానీ విద్యార్థి మనస్సులో ఉద్భవించడం మానేసింది అనవలసి వస్తున్నది. అంటే విద్యను అర్థిస్తున్నానని అభినివేశంతో అభ్యసించే విద్యార్థుల సంఖ్య బాగా క్షీణించిందనే చెప్పాలి.

ఎప్పుడైతే యీ అభ్యర్థనం పరప్రేరితమైందో అప్పుడే విద్య మరొక ధోరణిని పట్టినట్లు. అభిలాష లేని ఆడది కాపరం చేసినట్లు- ఆకలిలేనివాడు మెతుకులు గతికినట్లు- భక్తి లేనివాడు స్వామినిగొల్చినట్లు- వాత్సల్యం లేని సవతితల్లి, పిల్లల్ని సాకినట్లు- సహజమైన ఆకూతం మనస్సుల్లో లేని వాళ్ళు విద్య నభ్యసించబూనడం! తల్లిదండ్రుల్ని తృప్తి పరచడానికో- పెద్దకట్నాలను పొందడానికో- లేక విద్యాభ్యాస మొక నిమిత్తంగా- ఇతర సదుపాయాలను [అంటే సినిమాలను, హోటళ్ళను, ఇస్త్రీమడతలను, నాగరిక దుస్తులను, టాయిలెట్‌ను, ఇంకా ఇంకా ఎన్నిటినో] పొందవచ్చుననో యీనాడు అనేకులీ "ఆశ్రమాన్ని" స్వీకరిస్తూ ఉన్నట్లు గమనిస్తాము.

ప్రధానోద్దేశము జ్ఞానార్జన మనేది ఎప్పుడు దూరమైపోయిందో, అప్పుడే వెర్రితలలంటూ వేయడం ఆరంభించింది యీ వ్యవస్థ. సమాజంలో విద్యాధికుడికి గౌరవం అంటూ ఆధిక్యం అంటూ ఇవ్వడం నేర్చుకుంటే అప్పుడు విద్యకు విలువ ఉన్నదని గుర్తించినట్లన్నమాట.

ఒకనాటి కాలంలో సమాజంలో విద్యాధికుడికి అంతటి ఆదరమూ గౌరవమూ పలుకుబడీ అధికారమూ ఉండేవి.

గురుకులాశ్రమాలు దేవాలయాలలాగా పవిత్రమైనవి. ఆ విద్యాలయాలలో కులపతి దేవుడులాంటివాడు. ఆతడు కరుణామయమూర్తి; విజ్ఞాన స్వరూపుడు. ధర్మప్రబోధం చేసి నైతిక స్వర్గానికీ, జ్ఞానమార్గం చూపి మానవ మనోవికాసానికీ, తోడ్పడే మహర్షి. గురుకులాశ్రమ పోషణానికి నాటి కాలాన రాజులు ఎంతగానో శ్రద్ధ చూపేవారు. అంతేకాదు- రాజులు సైతం గురుభక్తి సత్యాంతంగా కల్గిఉండి సంఘవ్యవస్థలో భూమీశుని కన్న భూదేవుని కి (ఆచార్యునికి) అగ్రతాంబూలం ఇప్పించేవారు. అంతటి సభాపూజ్యత, రాజగౌరవం, గురువుకు లభించి ఉంటే ఒక్క శిష్యుల భావమేకాదు, గురువు మీద సంఘానికంతకూ గౌరవం, లక్ష్యం ఎంత ఉన్నతంగా ఉండగలవో ఊహించండి.

ఈనాడిది మృగ్యం. బడిపంతులనండి, అయ్యవారు అనండి, మాష్టారు అనండి, ఉపాధ్యాయుడనండి, లెక్చరర్ అనండి, రీడరనండి, ప్రొఫెసరనండి- మీ రే పేరుపెట్టి అయినా పిలవండి. వీళ్లందరినీ ఒక్కలాగానే చూస్తున్నది ప్రభుత్వం. ప్రభుత్వదృష్టిలో వీరు చివరకు పరిగణింపదగని వారుగా నిలచినారు. ఏవర్గం సమ్మెచేసినా- భయమూ, ఆందోళనా, ఇబ్బందీ ఇరకాటం కల్గుతుంది. కాని ఈ పంతుళ్ళ వల్ల కలిగే హాని ప్రభుత్వానికి ఏమాత్రం లేదని నేటిపాలకుల విశ్వాసం, అనుభవమున్నూ. దీన్నిబట్టి పూర్వకాలాన గురుకులానికి ఉన్న పావిత్ర్యం- గురువుకున్న రాజగౌరవం ఈనాడు లేక పోతున్నట్లు స్పష్టం అవడమేకాక, పైపెచ్చు ఉపా

ధ్యాయుడంటే అలసభావం- తృణీకారబుద్ధి ప్రబలుతూన్నట్లు కూడ గ్రహిస్తాము.

మరొకటి: పూర్వం గురువు పొట్టకోసం తాపత్రయ పడడం లేకుండా రాజులు గురువులకు భూరిదక్షిణలిచ్చేవారు; భూదానాలు, గ్రామదానాలు చేసేవారు గురుకులాలకు! సర్వ విధాలా అగ్రస్థానం కల్పించి, ఏలోటూ లేకుండా ఉండేటట్లు చేసేవారు. ఉదరపోషణార్థం తిప్పలుపడడం గురువుకు లేక పోయిందన్నా- రాజగౌరవం అత్యధికంగా నాటి కులపతికి ఉండేదన్నా- ఆలోచించండి ఈ విద్యావ్యవస్థకున్న ప్రతిపత్తి సంఘదృష్టిలో ఎంతఉన్నతంగా పెరిగి ఉండడానికి వీలున్నదో. ఇవి లోపించిన కారణానే యీనాడు అధోగతిలో ఉపాధ్యాయు డుండడంగానీ, అలసుగా విద్యార్థులు చరించడంగానీ జరుగుతూన్నవి. దేశాభ్యుదయానికని వేసే ప్రణాళికలలో ఏర్పరచు సలహాసంఘాలలో, దేశాంతరాలకు పంపే పరిశీలక సంఘాలలో, సంస్కృతీ ప్రతినిధి సంఘాలలో, హెచ్చుగా పంతుళ్ళకు అవకాశాలు లభింపకపోవడంవల్లకూడ వీళ్ళు వట్టి నిరుపయోగులనీ- అప్రయోజకులనీ భావం పెంపొందడానికి హేతువు అవుతున్నది. ఆర్థికంగా వీరు చాల వెనుకబడి ఉన్నారు. ఆవిధమైన విలువలు ఉన్నతీ లభిస్తేగాని, (ఆర్జవం ఎంతఉన్నా) ఆదరింపబడడం కల్గదు.

పార్టీ ప్రాబల్యమేకాని బుద్ధివైభవంకాదు ఈనాడు ఉన్నతస్థానాలను పొందడానికి కారణం. వైదుష్యంపై కాదు వైమనస్యాలకు దారితీసే వర్గకుల ప్రతిపత్తిపైన అధికార స్థానాల పంపిణీ జరుగుతోంది. పరిపాలనాధికారం పొందడానికి

విద్యార్హతలంటూ ఏవీ ఉండాల్సిన నియమం లేదు. విద్య లేకుండానే పార్టీ బలంవల్ల దేశపాలన చేయబూనవలెననే, అభిప్రాయం వ్యాప్తిపొందడంవల్ల విద్యావ్యవస్థకు ఎంత దెబ్బో పెద్దలు గ్రహించవలసే ఉంది.

సహజమైన ఆదరం, అభిమానం, అభిరుచీ విద్యపైన సంఘంలో అభివృద్ధిచెందాలి. విద్యాధికుడికి ఉన్నతస్థానమూ, విలువా లభించాలి. విద్యార్థులకూ, ఉపాధ్యాయులకూ ఆర్థికంగా ఎలాంటి ఇబ్బందీ పడకుండా ఉండేటట్లు ప్రభుత్వం తగు శ్రద్ధ పూనాలి. ప్రజా ప్రాతినిధ్యం విద్యాధికునికే, సమర్థునికే లభించాలి; కనీస విద్యాప్రమాణాన్ని అయినా అభ్యర్థులకు ఏర్పరచడం అవసరం. సమాజసౌఖ్యానికీ, పరిపాలనా సౌష్ఠవానికీ, దేశసౌభాగ్యానికీ విద్యావంతు లవసరమనే భావం వ్యాప్తికావాలి. విద్యా ప్రాతిపదికపైన జాతి అనే సౌధం పునర్నిర్మితం కావాలి.

విద్యకు ప్రాముఖ్యం- విద్యాధికుడికి గౌరవమూ, పలుకుబడీ, అధికారమూ లభింపజేస్తే పార్టీలూ, ప్రభుత్వాలూ పటిష్టం కాగల్గుతాయి.

అవినీతినీ- స్వార్థాన్నీ- దౌష్ట్యాన్నీ- అజ్ఞతనూ రూపుమాపేటందుకు అనువుపడే విద్యయే విద్య- మనోవికాసాన్నీ, హృదయవైశాల్యాన్నీ కల్గించే- సానుభూతినీ, సహృదయత్వాన్నీ, సహనాన్నీ, కారుణ్యాన్నీ పెంపొందించి- నియతంగా కర్మను ఆచరించేందుకు కావల్సిన స్థైర్యాన్నీ, వివేకాన్నీ అలవడజేసేదే విద్య! సహజాభిలాషా, అంత

శ్రద్ధ, అధికశ్రమా, అకుంఠితదీక్షా, చిత్తైకాగ్రతా, బుద్ధినైశిత్యమూ, విశాలదృష్టీ, మొదలైన అత్యంతావశ్యకాలైన గుణాలతో విద్యార్థులు విరాజిలితేను, అట్లాంటివారిసంఖ్య అభివృద్ధి పొందితేను, మానవాభ్యుదయం– శాంతీ ఏర్పడి తీరడానికి ఎంతోకాలం పట్టదు. అందుకు కావాల్సిన శ్రద్ధ అన్నివర్గాలలో అమరునుగాక!

[మద్రాసునుంచి వస్తూన్న 'మాతృసేవ' దుర్ముఖి సంవత్సరాది సంచికకు పంపిన వ్యాసం.]



# విద్యార్థి జీవితము - కర్తవ్యము

మానవుని జీవితములో విద్యార్థిదశ ప్రముఖమైనది. స్వేచ్ఛాయుతమైనది; సుఖప్రదమైనది. అయినను అందు బాధ్యత లేకపోలేదు! ఆ దశయందు దుఃఖద్వేషములకు గాని వర్గమత భేదములకుగాని తావులేదు. నిర్మల ప్రేమైక జీవితమునకు, ఉత్సాహశక్తికి ఆవలమైన మహత్తర దశయది. తరువాత రానున్న లౌకిక జీవనమున కంతటికి విద్యార్థిదశయే ప్రాతిపదిక!

విద్యార్థుల హృదయములు కుసుమ కోమలములు; నవనీత సదృశములు. అందంకితమైన యే చిహ్నమైనను శాశ్వతమై నిలుచును. వారి సుకుమార హృదయాంబుజములు విజ్ఞాన భానుని కిరణస్పర్శచే స్పందితములై, అజ్ఞాన తమస్సులు విచ్చిపోయి, మనోహరములుగా వికసించును. ఇవ్విధముగా ధీజ్యోతిచే దీప్తివంతములైన విద్యార్థుల నిర్మల హృదయాంబుజములు దేశకల్యాణ తోరణములుగా ప్రకాశించుటకు సమర్థములు. అట్టి వికాసము పొందుటే విద్యార్థిదశయొక్క పరమలక్ష్యము!

జాతి సమైక్యతకుగాని, దేశస్వాతంత్ర్యమునకుగాని, రాష్ట్రసాధనమునకుగాని, మరి యే యుదారాశయమునకుగాని విద్యార్థిదశయందే బీజావాపము జరుగవలెను. అది జరుగనిచో, విద్యార్థిదశ వ్యర్థమైన దగును. అంతియేకాదు; అందుమూలమున జాతికూడ వ్యక్తిలేనిదై ఛిన్నాభిన్నమై పోవును. తత్పరిణామముగా మానవుల జీవితములు కష్టభాజ

నములగును. అట్టి అపచారమును వారించుటకు మానవులు విద్యార్థిదశయందే విద్య నార్జించి తత్ఫలితముగా వినయవివేకముల, సహన సహృదయత్వముల నలవరచుకొనుట యావశ్యకము; కార్యసాధనమునకు వలసిన ధారణ, ఏకాగ్రత, దీక్ష నాడే పట్టుపడవలెను. స్వస్థాన, వేష, భాషా, మతముల యందభిమానము ప్రోదిగొనవలెను.

ఇట్టి యుత్తమగుణముల నీనాడు విద్యార్థు లెంత వరకలవరచుకొనిరో తమకు తాము పరిశీలించుకొనవలసి యున్నది. అమూల్యమైన తమ విద్యార్థిదశయందు నేర్వవలసిన ఉత్తమ మానవ ధర్మముల నభ్యసించి, ఆచరణమందు వానిని పెట్టి, సచ్ఛీల సంపదను సముపార్జించి కృతార్థులగుదురుగాత!

(మార్చి 1948 "హిందూ కళాశాలాపత్రిక"లో నా సంపాదకీయ వ్యాసంనుంచి)



## అమెరికాలో బీదలకు విద్య

బీద విద్యార్థికి విద్యావకాశాల్ని ఏర్పరచడంలో, 'నీ విద్యను నువ్వే సంపాదించుకో' అనే సూక్తిని అమెరికా చాలాకాలంనుంచి ఆచరణలో పెట్టింది. ఇప్పుడు ప్రతి సంవత్సరమూ ఉన్నతవిద్యకోసం, విద్యాలయాలల్లో ప్రవేశించే యువతీయువకుల సంఖ్య పెరుగుతూండడమువలన, ఇట్లా ప్రవేశించేవాళ్ళల్లో ఎక్కువమంది ఆర్థిక దుస్థితిలో ఉన్న కుటుంబాల్నించి వచ్చేవారు కావడం మూలానా, యీ సమస్యమీద ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నారు. వీళ్ళల్లో చాలవరకు కళాశాలా విజ్ఞానానికి నిజమైన అభిరుచికలవాళ్లు గాని, దాని మూలంగా ఎక్కువలాభం పొందగలిగే బుద్ధి కుశలతకలవాళ్లు గాని లేనట్లు తెలుస్తూన్నది. అటువంటి విద్యార్థుల్ని కళాశాలల్లో చేర్చి, వాళ్ల యిష్టంవచ్చినట్లు చదువుకోనిచ్చేకన్న వృత్తి విద్యల్లో తరిఫీదు పొందేటందుకు ప్రోత్సహించాలి. ఉన్నత విద్యార్థులకు గదికి, భోజనానికీ, జీతానికీ సరిపోయే వేతనాల్నిచ్చి, బయటి ఉద్యోగాల్తో నిమిత్తంలేకుండేటట్లు జేయాలి.

## ఆరోగ్యానికి అపాయం

స్వయంపోషక పద్ధతితో కళాశాలా విద్యను అభ్యసించడానికి ప్రయత్నించే విద్యార్థి అనేకకష్టాలకు గురిఅవుతాడు. కళాశాల పూర్తి కార్యక్రమాన్ని, జీవనాధారం కల్పించుకోడానికి పడే కష్టంతో సమ్మేళనం చేయడం మూలాన్న కలిగే ఆరోగ్య నష్టం చాలా తీవ్రమైనదని సూచింపబడింది.

ఆర్థిక విషయాల్లో ఎడతెగని విచారం, స్వయం - పోషణానికి వినియోగించేకాలం, విద్యార్థియొక్క విద్యాసాధనకు భంగం కలిగించడమేకాక, సహజ ప్రవర్తనలో సంఘచర్యల్లో మార్పు కలిగిస్తుంది. కళాశాలా ఆర్థిక సహాయంకూడా ఎక్కువవుంది విద్యార్థులకు పంచితే ఒక్కొక్కడికి తక్కువ లభిస్తుంది. అదేగాక, పనిచేసే విద్యార్థులసంఖ్య అధికమైన కొద్దీ, ఉద్యోగాలకు పోటీ హెచ్చుతుంది. దీన్ని కనిపెట్టి ఉద్యోగా లిచ్చేవాళ్ళు జీతాల్ని తగ్గించడం నేర్చారు. ఈ నష్టాలేకాకుండా, ధనార్జనకోసం కాలం వెచ్చించే విద్యార్థులు, తమ శక్తుల్ని వినియోగిస్తారు కాబట్టి, కళాశాలయొక్క సాంఘిక జీవనానికి మిగిలిన విద్యాలయ విజ్ఞానానికి దూర మౌతున్నారు.

కొన్ని సంవత్సరాల క్రితం అమెరికా కళాశాలల్లో స్వయంపోషకత్వ విధానాన్ని ప్రయత్నించారు. కాబట్టి ఇల్లాంటి విమర్శనానికి తావు ఏర్పడింది. పైన పేర్కొన్న నష్టాలు స్వయం పోషకత్వంవల్ల వచ్చినవే కాకుండా, ధనార్జన కోసం పాటుపడే విద్యార్థులకు ధారాళంగా సెలవు యియ్యటానా, అక్రమమైనా, విధాన విరహితమైనాప్రణాళికల్ని అమల్లో పెట్టడాన వచ్చినై. ఎట్లాగైతేనేమి, అమెరికా కళాశాలలు ప్రాచీన పద్ధతుల్లోని లోటుబాటుల్ని గ్రహించి విడిగా ప్రతి విద్యార్థియొక్క బుద్ధికుశలతనూ ఆర్థికా వశ్యక తను కనిపెట్టి జాగ్రత్తతో ఉద్యోగాల్నిచ్చే విధానం ప్రవేశ పెట్టారు. ఇప్పుడు స్వయం పోషకత్వం విద్యలో ముఖ్యాంశ మయినదనీ, కళాశాల మార్గం కాదనీ గ్రహించారు. కాబట్టి

అమెరికా విద్యాలయాలు స్వయం సహకార సూక్తిని బల పరుస్తున్నై.

## రాష్ట్ర సహాయం

గతకొన్ని సంవత్సరాలలో అమెరికా కళాశాలలు తమ బీద విద్యార్థులకు సహాయ పడడానికి చేసే శ్రమ విద్యార్థుల ఆరోగ్యానికి యెంత మాత్రమూ ఆటంకం కాకుండా, విద్యాలయ కార్యసాధనకుకూడా యెటువంటి అభ్యంతరమూ కాకుండా వాళ్ళ కార్యక్రమాన్ని అత్యున్నత మార్గాన నడపడానికి వీలయ్యే నూత్న పద్ధతుల్ని కనిపెట్టడానికి దారి తీసింది. కళాశాలల్లో మాదిరే ప్రభుత్వంకూడా బీదల ఆవశ్యకాలకు జవాబుదారి వహించింది. ఈమధ్య ఫెడరల్ కార్యాలయంవాళ్ళు కొన్ని విద్యాలయాల్లో బీద విద్యార్థుల పైన శ్రద్ధ వహించే సమస్యల్ని యెదుర్కొనే మార్గాల్నికూర్చి విషయాల్ని పంపవలసిందని అడిగారు. వాటి అన్నిటి సారాంశమూ క్రోడీకరించి, ఫెడరల్ కార్యాలయం వాళ్ళు దేశమంతటా ఉన్న విద్యాలయాలకు వీటి ప్రతుల్ని పంపారు. అంతేకాదు. బీద విద్యార్థులమీద కరుణ వహించి ప్రభుత్వం "యువజన సహాయనిధి" అనే పేరుతో ఒక నిధిని స్థాపించి ఆర్థిక సహాయం కోరే బీదలకు తోడ్పడేటందుకు విద్యాలయాలకు దాంట్లో నుంచి గ్రాంటును ఏర్పాటు చేసింది.

ప్రభుత్వ మీ నిధినుంచి ప్రతి విద్యాలయానికి విద్యార్థుల సంఖ్యలో నూటికి 12 గురి చొప్పున సరిపోయేటంత గ్రాంటును ఇస్తుంది, ఈ మొత్తాన్ని బీదవిద్యార్థులకు ఊరికే

డబ్బునే బహుమతుల్నిగా యివ్వక, వాళ్ళు చేసిన పనికి బత్తాలుగా పంచారు. ఉదాహరణానికి:— హంటరు కళాశాలలోఉన్న స్వయంపోషక విద్యార్థుల్లో 925 గురు 1939 సంవత్సరంలో యీ నిధినుంచి బత్తాలు పుచ్చుకున్నారు. ఈ విద్యార్థులు గంటకు 50 సెంట్ల వేతనం వంతున నెలలో 20–30 గంటలు పనిచేయాలట. కళాశాలలో ప్రథమసంవత్సరము విద్యార్థి నెలలో 20 గంటలకన్నా యెక్కువ పనిచేయడానికి వీలులేదు. నవీనులు కళాశాల జీవితంలో మొదటి సంవత్సరంలో పాల్గొనేటందుకు కష్టంగా ఉండకుండా ఉండడానికి వృత్తిఅవకాశాలు సాధారణంగా తగ్గించబడినాయి. ఈ నిధి క్రింద పనిచేసేవాళ్ళను చాలావరకు కళాశాల కార్యాలయంలో తదితర శాఖల్లోను ఉంచుతారు. వాళ్ళల్లో కొందరికి గ్రంథాలయాల్లో, వస్తుప్రదర్శనశాలల్లో, సంఘసేవా సంస్థల్లో పనియిస్తారు. న్యూయార్కు విశ్వవిద్యాలయంవాళ్ళు 1938–39 సంవత్సరంలో 1500 స్వయంపోషక విద్యార్థులకు వివిధాలైన పనుల్ని చేసినందుకే నిధినుంచి 2,30,530 పౌన్ల గ్రాంటును ఇచ్చారు. ఈ గ్రాంటువల్ల విశ్వవిద్యాలయమూ, విద్యార్థులూ లాభం పొందారు. విశ్వవిద్యాలయానికి యితరవిధంగా జరగని ఉపకార మీ విద్యార్థులమూలంగా జరిగింది. విద్యార్థులీ గ్రాంటువల్ల వేతనాలు తీసుకొని కళాశాలలలో చదువుకోడానికి వీలౌతున్నది. సామాన్యంగా విశ్వవిద్యాలయపు కార్యాలయాలన్నీ యిట్లా తరిఫీతునందే విద్యార్థుల్నే ఉపయోగిస్తున్నాయి. ఈ గ్రాంటు విద్యాలయాల్లో ఎల్లకాలము సహాయపడేది కాదు.

## ఇతరోపాయాలు

అమెరికా కళాశాలలకు సర్కారు గ్రాంటు కాక, ఉద్యోగ సంస్థలు, చేబడులు యిచ్చే ఫండ్లు, విద్యార్థివేతనాలు మొదలైన శాశ్వతమైన ఆధారాలున్నాయి. బీద విద్యార్థుల సహాయార్థం వాటిని నడుపుతున్నారు. కళాశాలయొక్క ఉద్యోగసంఘం ప్రతివిద్యార్థియొక్క విద్యాలయంల్లో సాధన, యితర వ్యాసంగాల్లో అభిరుచి, వృత్తివిద్యలో పరిచయము, పనిచేసిన కాలపరిమితి, మొదలైనవాటిని అతనికి తగిన ఉద్యోగాన్ని యీయడానికి, వీలుకావడానికి వ్రాసుకొంటుంది. వాళ్ళకు ఉపయుక్తమయ్యే వ్యక్తికి సంబంధించిన పుస్తకాలు, కాగితాలూ కలిగిన చిన్న గ్రంథాలయాన్ని పోషిస్తుంది. ఈ సంస్థ పట్టభద్రులైనవాళ్ళకుకూడా ఉద్యోగాల్నివ్వడానికి పాటుపడుతుంది. ఫర్డాన్ విశ్వవిద్యాలయంయొక్క వృత్తి సంస్థ, యిటీవల న్యూయార్కులో జరిగిన ప్రపంచ వస్తు ప్రదర్శనములో మార్గదర్శకులుగా, పరిశోధకులుగా, తదితర పనివాళ్ళుగా తరఫీతుచేయడానికి ఒక తరగతి నేర్పాటుచేసింది. పట్టభద్రులు కానివాళ్ళు 500 మంది దీంట్లో చేరారు. "Man Marketing Clinic"—చికిత్సాలయాన్ని ఒకదాన్ని నెలకొల్పారు. విశ్వవిద్యాలయంలో సాధింపబడేవాటిలో మొదటిదైన యీ సంస్థ ఉద్యోగాలలో నెగ్గవలసిన విధాలూ, విక్రియపత్రాలు లిఖించే పద్ధతులూ, మొదలైన విషయాల్ని చూస్తూంటుంది. విద్యార్థుల్ని ఉద్యోగాలకు పిలిపించినప్పుడు వాళ్ళు తత్తరపడకుండడానికి, ముందుగా ఆ పద్ధతుల్నికూడా వాళ్ళకు నేర్పుతుంది. నిజానికి యీ సంస్థ ఉద్యోగాల్ని

సంపాదించడం మొదలుకొని, వాటిలో ప్రవేశం కల్పించుకునే వరకు తెలిసికొనాల్సిన విషయాలన్నింటినీ నేర్పుతుంది.

కొలంబియా విశ్వ విద్యాలయంయొక్క ఉద్యోగ కార్యాలయం 1938 సంవత్సరంలో 7,500 విద్యార్థులకు విరామకాలాల్లో పనుల్ని చూపించింది. వాళ్ళు తమ కళాశాల ఖర్చులకోసరం కలిపి, మొత్తం 1,000,000 పౌన్లు సంపాదించారు. ప్రిన్సన్లో మూడోవంతు విద్యార్థులు తమ ఖర్చులకు సంపాదించుకొంటున్నారు. గత సంవత్సరంలో ప్రిన్సన్ విశ్వవిద్యాలయంలో ఉద్యోగ కార్యాలయం బీద విద్యార్థులకు 2,073 విరామకాలంలో చేసే ఉద్యోగాల్నిచ్చింది. విద్యార్థినులుసైతం తమంతట తాము సంపాదించుకో వెనకాడలేదు. ఉదాహరణానికి: గౌచర్ కళాశాలలో 132 విద్యార్థినులు 1937-38 లో శిశుపోషణముచేస్తూ, వస్తువుల్ని విక్రయిస్తూ, చదువునేర్పుతూ, టైపుచేస్తూ, గుమాస్తాపనిచేస్తూ, మోటార్లు నడుపుతూ, పత్రికావిలేఖర్లుగా ఉండీ, అచ్చువేసేచోట్లలో ప్రూఫురీడర్లుగా ఉండీ, సంగీతాన్ని నేర్పుతూ, 7,500 పౌన్లు సంపాదించారు. ఈవిధంగానే విద్యార్థులు అన్నివిధాలైన పనుల్ని యెట్టిపనులైనా నీచాలుకావని చేస్తారు. వాళ్ళు భోజనశాలల్లో వడ్డించడం, నాటకశాలల్లో ద్వారంవద్ద నుంచోడం, ఇన్స్యూరెన్సు యేజంట్లుగా ఉండడం, చిత్రకారులుగా, పత్రికావిలేఖరులుగా, లా విషయాల్లో సహాయకులుగా, టిక్కెట్లమ్మేవాళ్ళుగా, వ్యాయామ పోటీలల్లో గేట్‌కీపర్లుగా, రక్షకభటులుగా, గుడ్డివాళ్ళకు మార్గం చూపెట్టేవాళ్ళుగా,

గ్రంథాలయాధికారులుగా, పరిశోధకులుగా యింకా అనేక పనుల్లోనూ పనిచేస్తూ ఉంటారు.

## అప్పులు - నిధులు

చాలా కళాశాలలు విద్యార్థుల చేబదులుఫండు నొకదాన్ని స్థాపిస్తున్నాయి. దీనినుంచి ధనసహాయ మవసరమైన విద్యార్థులకు తక్కువ వడ్డీకి చేబదుళ్ళ నిస్తారు. ఇది గాకుండా విద్యార్థి వేతనాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని విద్యార్థి ఖర్చుకంతకూ సరిపోయేవి కూడా ఉన్నాయి. 1937–38 లో ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయం విద్యార్థి వేతనాల క్రింద 1,51,129 పౌన్లను చేబదులుగ 61,605 పౌన్లను, యిచ్చింది. ఈ విద్యార్థి వేతనదానంలో కొత్త విధానండుంది. స్వార్తుమూరు కళాశాలలో చదువులో మెరుగునుబట్టి యివ్వడానికి తోడుగా పనిచేయడానికి కూడా యిస్తున్నారు. ఈ వేతనం సంవత్సరానికి 50–200 పౌన్లవరకూ. ప్రతివారంలో యెన్ని గంటలు పనిచేశాడో దానిపైన ఆధారపడి ఉంటుంది. 8 గంటలు వారంలో పనిచేసేవాళ్ళకు వేతనం 200 పౌనులు. 6 గంటలైతే 150 పౌనులు : 4 గంటలైతే 100 పౌనులు : 2 గంటలైతే 50 పౌనులు : సంవత్సరానికి కిట్టుతుంది స్వార్తుమూరులో 1938–39 లో 678 మందికి 155 విద్యార్థులు (105 పురుషులు : 50 మంది స్త్రీలు) పనిచేసినందుకు వేతనాల్ని పొందారు.

## ఎటువంటి పని యీయబడింది?

ఈ విద్యార్థి వేతనాలు గ్రహించేవాళ్ళు చేసే పనులన్నీ కళాశాలలో ప్రతి శాఖకు సంబంధించినవై ఉంటాయి.

గ్రంథాలయాధికారి క్రింద సహాయకుడుగా, కళాశాల కార్యాలయాల్లో గుమాస్తాగా, స్త్రీ పురుషుల వ్యాయామ శాలలకు కార్యదర్శులుగా ఉండి వీళ్ళే నిర్వహిస్తారు. కళాశాల పోస్టాఫీసు, పుస్తకాల స్టోరు, వేతనాల్ని తీసికొనే విద్యార్థులవల్ల నడపబడుతున్నది. అన్నపానాదులకు నియామక మైనవాళ్ళు వెళ్ళిన కాలంలో విద్యార్థులే స్విచ్ బోర్డును సరి చూసుకుంటారు. ఆచార్యులకు కూడా వాళ్ళే కార్యదర్శులుగా పనిచేస్తూ వుంటారు. వేతనం గ్రహిస్తున్న ఇంజనీరింగు, కెమిస్ట్రీ, ఫిజిక్సు, బాటనీ విద్యార్థులు తమ ఆచార్యులకు లాబరేటరీలలోనూ, వర్కుషాపులలోనూ, మొదటి సంవత్సరపు విద్యార్థుల పరీక్షాపత్రాల్ని సరిచూడడంలోనూ సహాయపడుతూ ఉంటారు. తర్వాత సంవత్సరాలలో ఈ సహాయం వాళ్ళనే అభివృద్ధిలోకి తెస్తుంది.

స్వయంపోషక పద్ధతిని ప్రోత్సాహించే కళాశాలలకు తోడుగా కేవలమీ స్వయం సహాయ సూక్తి ననుకరిస్తూ, కళాశాలలో పనినీ, బయట పనినీకూడా విద్యార్థులచేత చేయించే విద్యాలయాలు కొన్ని ఉన్నాయి. వాళ్ళు సబ్బులు, పౌడర్లు మొదలైనవాటిని, చాపలను, లోహాలతో కొన్ని పనిముట్లను, నూలును, కొయ్యి సామానుల్ని తయారుచేసి అమ్ముతారు. అచ్చుపనుల్ని చేస్తారు. విశ్వవిద్యాలయపు కట్టడ నిర్మాణానికి రాళ్ళను చెక్కుతారు. ఇటుకల్ని చేస్తారు. కట్టడాల్ని నిర్మిస్తారు. బొగ్గు కంపెనీలను నిర్వహిస్తారు. విద్యాలయ మోటార్లను నడుపుతారు. గ్రంథాలయాల్లో పుస్తకాల జాబితాలను తయారు చేస్తారు, పంటల్ని పండి

స్తారు. వస్తువుల్ని అమ్ముతారు. కొన్ని విశ్వవిద్యాలయాలూ, కళాశాలలూ విద్యార్థులకు కళాశాల ఖర్చులకు బదులుగా పంట ధాన్యాన్ని, పాలు పెరుగుల్ని తెచ్చి యీయడానికి సెలవిచ్చారు. కొంతమంది విద్యార్థుల "కో-ఆపరేటివ్" సంఘాన్ని ప్రోత్సాహపరచారు. విద్యార్థుల వసతి గృహాల్లో పనివాళ్ళుగాని, ధనసహాయం చేసేవాళ్ళుకాని, లేక తమ పనుల్ని తామే చేసుకుంటూ జాగ్రత్తగా ఉండాలె నంటున్నారు. కళాశాల జీవితంలో క్రమంగా "కో-ఆపరేటివ్" సంఘు మొక శాశ్వత సంస్థ అయింది. ఇది సంయుక్త రాష్ట్రంలోనూ తదితర దేశంలోను వృద్ధి పొందుతున్న మిత వ్యయశాఖా కార్యాలలో ఒకటి.

## విద్యార్థుల ప్రథమ కర్తవ్యం

స్వయంపోషక కార్యక్రమాలు కళాశాలల వల్లనేకాకుండా, విద్యార్థి సంఘాలవల్లకూడా ఏర్పాటవుతాయి. అనేక విధాలైన విషయాల్లో విద్యార్థులకు తర్ఫీదు ఇవ్వడానికి ఏర్పర్చబడింది. పత్రికలకు ఏజంట్లుగా, సంచికలకు ఏజంట్లుగా స్వయంగా ఉపయోగపడే వస్తువులు చేస్తూ, క్రిష్టమసుకార్డ్లు చేస్తూ, కొయ్యసామాన్లు చేస్తూ విద్యార్థులు పాటుపడుతున్నారు. విద్యార్థులందరు పనిచేసి వాళ్ళల్లోవాళ్ళు లాభాల్ని పంచుకుంటారు. ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో విద్యార్థులు కుట్టుపనివల్లా, మిఠాయి దుకాణంవల్లా, ప్రయాణసంస్థలవల్లా, చదువు నేర్పడంవల్లా గత సంవత్సరం సంపాదించారు. ఇవి 891 ఉద్యోగాలకు తావిచ్చాయి. ఒక్కొక్క ఉద్యోగానికి

56 పౌన్లు యిచ్చింది. కళాశాల జరిగిన దినాల్లో పనిచేయని విద్యార్థులు ఎండాకాలం సెలవలలో పనిచేస్తారు. ప్రయాణీకుల కేర్పాట్లు కల్పించడము, ఎండాకాలంలో హోటళ్ళను నడపడము, ఆటలకు భూమిని చదరముచేయడము, మొదలైన పనులు వాళ్లకు చాలా ఉంటాయి. విద్యార్థులు వేసంగిలో సంపాదించే ధనం వాళ్ళ కళాశాల ఖర్చులకు సరిపోతుంది. చాలావరకు వృత్తి సంస్థలు వేసంగిలో ఉద్యోగాలు చూపుతూ ఉంటాయి.

## నాయకత్వానికి తర్ఫీదు

ఈ విధంగా విద్యార్థియొక్క అవసరాన్ని బాగా గుర్తించి కళాశాల తనవద్దనున్న ఉద్యోగాల్నుంచి, చేబదుళ్లు నిధులనుంచి, వేతనాల్నుంచి అతనికి కావాల్సిన ద్రవ్యాన్నిస్తుంది. ఇలా బీద విద్యార్థులకు తోడ్పడడంలో చిన్న కళాశాలలే కాకుండా పెద్ద పెద్ద విశ్వవిద్యాలయాలే— హార్వార్డు, యేల్, అనేవి పూనుకున్నాయి. స్వయంపోషక విధానాన్ని సరిగా నడిపినట్లయితే విద్యార్థి యొక్క విద్యాభివృద్ధిలో సాంఘిక సేవలో గొప్ప సహాయం చేసినదౌతుంది. ప్రజాపరిపాలన సంఘాలకు కళాశాల విద్యార్థులు మార్గదర్శకులుగా ఉండాలంటే, వాళ్ళకు ప్రపంచంలో చేయబడ్డపనిని చూసి మెచ్చుకొనే బుద్ధికుశలతే గాక, దానితో భావోద్రేకమూ ఔత్సుక్యమూ మేళనం పొందాలి. అప్పుడే ఆ సంఘంలో స్త్రీ పురుషుల సహాయం పొందడానికి వీలుంటుంది. అదీగాక, తమంతట తాము సంపాదించుకుని విద్య నేర్చుకోవడంవల్ల, ధన సహాయం కొద్దిగాగల తల్లిదండ్రులపై

భారం లేకపోవడానికి తోడుగా, విద్యార్థికి ఆత్మ విశ్వాసము స్వాతంత్ర్యము ఏర్పడుతున్నాయి. ఇంతకన్నా ముఖ్యమైన విషయమేమంటే వారి సామాన్య ఊహాలకుపయోగమైన పని నెరవేర్చడానికి అవకాశాలు కల్పిస్తుంది. ఇందుమూలంగా అమెరికా కళాశాలలు స్వయంపోషక విధానంతో బీద విద్యార్థులకు విద్యనిస్తూ పోత్సహిస్తున్నాయి. అందువల్లే ఇతర ప్రదేశాలకన్నా అమెరికాలో ఉన్నతవిద్య నభ్యసించడానికి ఎక్కువమంది యువతీయువకులకు వీలు కలుగుతున్నదని గ్రహించాలి.

[మద్రాసునుంచి వచ్చే "ప్రజాబంధు"లో 1939 లో ప్రచురింపబడిన యీ వ్యాసం అనువాదం]



# జాతీయ ప్రభుత్వావిర్భావం

మన భారతదేశము తదితర దేశములకన్న ప్రత్యేక సంస్కృతీ సంప్రదాయములు కలిగి, విశిష్ట సాహిత్య కళా శాస్త్ర సంపదకలిగి, దేశ పార్థక్యమును వ్యక్తీకరించు నాధ్యాత్మిక తత్వ మన్నిట వ్యాపించి, సర్వసంపత్సమృద్ధమై, శాంతిభద్రతల కాలవాలమై పూర్వము ప్రశస్తి గాంచినది.

పరదేశీయుల కాకర్షవంత మగుటవలనను, దేశీయుల యేమరపాటువలనను మనదేశము క్రమక్రమముగా నన్యాక్రాంతమైనది. తదాదిగ మనదేశీయు లస్వతంత్రులైరి; మీదుమిక్కిలి దాస్యభావము హెచ్చినది. ఈ భావమునకు రెండు కారణము లున్నవి. పరిపాలకుల పాలనావిధానము మొదటిది; మన దేశీయులకు పాశ్చాత్య నాగరకతా సంస్కృతులపై లేనిపోని వ్యామోహము పెచ్చు పెరుగుట రెండవది. తత్ఫలితముగా స్వీయ సంస్కృతిని, నాగరకతను, సంప్రదాయమును సాహిత్య కళాశాస్త్రాదికముల నన్నిటిని విస్మరించి, ద్వేషించి, తుద కసహ్యించు కొనునంతటి దౌర్భాగ్యము భారతీయులలో ప్రబలినది. పాశ్చాత్య సంస్కృతీ ప్రభావము మెకాలే విద్యావిధానముద్వారా మనదేశమున నింటింట ప్రచుర్యమునంది ప్రాధాన్యము వహించుచు వచ్చినది. సోమరితనము మిక్కుటముగా పెరిగినది. మాట మర్యాదలు, ధైర్యసాహసములు, వినయవిభూతులు, సహనౌదార్యములు, భక్తి విశ్వాసములు మొదలైన గుణము లడుగంటినవి. ఆధ్యాత్మిక చింతపోయి లౌకికచింత వృద్ధి చెందినది; పాపభీతి,

ద్వైవభీతి వశించినవి. న్యాయమూర్తులకు స్వస్తిచెప్పిరి. మోసము సర్వత్ర పాలించు ధర్మమైనది! 'తమసో మా జ్యోతి ర్గమయ' అనుచు చీకటినుండి వెలుగులోనికి వెడలు మార్గము నన్వేషించు జిజ్ఞాసలో నుండెడి భారతీయులు తమో లోకములోనే చిరకాలము తన్నుకొనుటకు పూనుకొనిరి!

సుమారు రెండు శతాబ్దము లిట్లంధ పథముల సంచరించి, భ్రాంతి లోకములందు పర్యటనముచేసి, పాశ్చాత్య వ్యామోహాంబుధిలో గుంకులిడి, యెట్టకేలకు, పలువురు మహాత్ముల నిరంతర బోధలవలన, దేశభక్తుల తనుత్యాగముల వలన, హృదయ విదారకములైన సంఘటనలవలన, బహువిధోద్యమ నిర్వాహణమువలనను భారతీయ హృదయములలో సంచలనము కల్గినది. తత్ఫలితముగా దేశీయులలో స్వాతంత్ర్య కాంక్ష జనించినది; దేశస్థితిగతు లవగతములైనవి; వివేచనా శక్తి యలవడినది; దేశాభిమాన జాత్యభిమానములు పొదిగొన్నవి. ఇవ్విధముగా దేశస్వాతంత్ర్యము గడించుటకు పోరాడుచున్న నాయకుల వెనువెంట దేశీయులు దీక్షతో నిర్వాగల ధైర్యసాహసముల నలవరచుకొన్నారు. ప్రజలలో నింతటి చైతన్యము కలుగుటకు చాలకాలము పట్టినది.

అనేక స్వాతంత్ర్య పోరాటాల ఫలితముగా మన దేశమునకు తాత్కాలిక జాతీయ ప్రభుత్వ మేర్పడినది! 1946 సెప్టెంబరు 2 వ తేదీ భారతీయ స్వాతంత్ర్య చరిత్రలో పర్వదినమే! భారత రాజకీయాకాశములో చిరతరముగా నలముకొనియున్న మేఘజాలము విచ్చిపోయినది. దేశమునకు దుర్దినములు దూరమైనవి. శుభ్రాభ్రి మండలములో భార

తీయ తేజఃపుంజము దేదీప్యమానముగా ప్రకాశింప వలసి యున్నది! దేశమందు ధర్మ సంస్థాపనము జరుగవలసియున్నది! జాతీయత నెల్లెడల ప్రసరింప జేయవలసియున్నది. బహు విధముల కల్లోలితమైన దేశమును క్రమక్రమముగా శాంతి పథములో నడిపించవలసియున్నది. హెచ్చుతగ్గులులేక ప్రజల నందరిని సముద్ధరించవలసి యున్నది.

విప్లవముల పురికొల్పుట కెంతటి పరిశ్రమ చేయవలసి వచ్చెనో తిరిగి శాంతిస్థాపనమునకు నంతకు మిక్కిలిగా శ్రమింపవలసియుండును. ఒక కట్టడమును నిర్మూలించుటకన్న మరొకదాని నా స్థలమున నిర్మించుట కష్టతరముగదా! కావు ననే నేడు ప్రథమదశలో నెన్నెన్నియో యాటంకములు పొడసూపు చున్నవి. ఇట్లు దేశీయులు తమలోనున్న పరస్పర భేదముల ప్రపంచించికొనుచు, వర్గవైమనస్యముల పోషించు కొనుచు, పశు ప్రవృత్తికి నవకాశమిచ్చుచు కాలయాపనము చేసినచో ముక్తిలేదు, సరికదా మహాదారుణమైన శాశ్వత దాస్య శృంఖలములకు భారత దేశము గురికావలసి యుండును. కావున సమరస భావముతో దేశస్థులందరు మెలగుచు తమ లోని లోపముల సవరించుకొనుచు సంపూర్ణ స్వాతంత్ర్యము నచిరకాలములో బడయుటలో ప్రతి భారతీయుడు కృషి యొనర్పవలసియున్నది. దేశమందు శాంతిని నెలకొల్పుటలో నీ నాడు పదవులలోనున్న నాయకులే కాదు, పదవులులేని ప్రజలందరుకూడ బాధ్యత వహింపవలెను. అధికారముచేత జరిపించుదానికన్న, అభిమానము కొలది జరుగు కార్యము సహజమై బలవత్తర మగును. కావున శాంతి ప్రజలవలననే

యేర్పడవలెను. అదుపాజ్ఞలతో సమకూడిన శాంతి, శాంతి కానేరదు.

కవులు తమ కావ్యములద్వారా శాంతిని ప్రబోధించుచు జాతీయతను పెంపొందింపవలెను. ఈనాడు కావ్య వస్తువు ముఖ్యముగా దేశపరముగానే యుండవలెను. సార్వకాలీన సార్వ జనీనమగు నుత్తమ సాహిత్యమును సృజింపవలెనను జిజ్ఞాస మహాకవులకున్నను, వారును కొంతకాల మీ ప్రచార వాఙ్మయమును సృజించితీరవలెను. దేశమందలి శాంతి స్థాపనమునకు వారును యథాశక్తి పాటుపడవలెనుగదా ! కవులు ప్రభువుల యాజ్ఞల పరిపాలించుటయైనది, మధ్యతరగతి ప్రజల మనుకారముల దీర్చుట యైనది; ఇక పల్లీయుల యొక్కయు, పాలేరులయొక్కయు పిపాసను తీర్పవలసి యున్నది. సకల విజ్ఞానమును సంగ్రహముగా సులభ బోధక మగు శైలిలో ప్రజల కందించుటలో రచయిత లెంతేని నుద్యమించుట యవసరము !

ఏ సమస్యా పరిష్కారమైనను, ఏ నూత్న ప్రణాళిక నైనను విద్యార్థులద్వారా దేశమందు సుస్థిరముగా ప్రవేశ పెట్ట గల్గుదుము. ఈ సూత్రమును గుర్తించియే విదేశీయు లింతగా నిన్నినాళ్ళు మనలను పరిపాలింపగల్గినారు. మన దేశ మును సుభిక్షముగా జేసికొనుటకు, దేశములు సుఖతమమైన జీవితమును గడపునట్లు చేయుటకు, భారతీయ సంస్కృతీ సంప్రదాయముల కనుగుణమైనట్టియు, భారత దేశమునకు సంబంధించినట్టి సాంఘికార్థిక సూత్రములు గలట్టియు, వివిధ

వృత్తులలో శిక్షణ నిచ్చునట్టియు ప్రణాళికల విద్యాసంస్థల నన్నిట ప్రవేశపెట్టవలెను. మాతృభాషలద్వారా దేశీయుల విద్యావంతుల జేయవలెను. అట్టి జాతీయవిద్య నేర్చిన విద్యావంతులే తరతరములుగా దేశమందలి స్థితిగతులను చక్కగా సమీక్షింపగలిగి దేశాభ్యున్నతి నొనగూర్చ సమర్థులగుదురు. ఇవ్విధముగా విద్యాసంస్థలపైన, విద్యావిధానముపైన తత్ఫలిసి విద్యార్థులపైన దేశముయొక్క భవితవ్య మాధారపడి యున్నది! కావున విద్యార్థులు తమకున్న ప్రాధాన్యమును బాధ్యతలను గుర్తించి తా మాదర్శ భారతీయులగుటకు సర్వ విధముల ప్రయత్నింతురు గాత! దేశములో శాంతిస్థాపన నిమిత్తమై సేవజేసి సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదమునకు మార్గము సుగమము జేయుదురు గాత! అస్తు.

[1947 లో "హిందూకళాశాలా పత్రిక"లో నా సంపాదకీయ వ్యాసం.]



# మన చరిత్ర స్వరూపం

మనం ఆంధ్రులమనీ, తెలుగువాళ్ళమనీ, తెనుగువాళ్ళమనీ వ్యవహరింపబడుతున్నాము గదా. మన పుట్టు పూర్వోత్తరాలను ఎరగకుండా ఉండడం సబబుకాదు. మనకు ప్రత్యేక భాష అంటూ, సారస్వతమంటూ, చరిత్రఅంటూ ఆచార వ్యవహారాలంటూ ఉన్నాయి. ప్రత్యేక భాషారాష్ట్రమంటూ ఏర్పడిన తర్వాత ఇపుడు వీటి స్వరూపంగూర్చి మనమందరమూ తెలుసుకొని ఉండడం మరింత అవసరమౌతున్నది. ఇతర ప్రాంతాలవారికీ ఇతర దేశాలవారికీ మనల్నిగూర్చి తెలుప వలసిన సందర్భాలు అనేకం ఇకముందు వచ్చితీరుతాయి. మాకు తెలియదని చెప్పుకోవడం అంత వంచన మరొకటి ఉండదు కదూ. అందుకని మన గతాన్ని సంగ్రహంగా అవలోకిద్దాం.

క్రీస్తుకు పూర్వంనుంచీ నేటివరకూ ఆంధ్ర ప్రాంతాన్ని ఏలుతూ వచ్చిన వివిధ రాజకుటుంబాలను యథాక్రమంగా ఉల్లేఖించుకుందాము: సాతవాహనులు- ఇక్ష్వాకులు- బృహత్పలాయనులు- శాలంకాయనులు- పల్లవులు- విష్ణుకుండినులు- తూర్పు చాళుక్యులు- వెలనాటి నాయకులు- కాకతీయులు- రెడ్డిరాజులు- విజయనగర రాజులు- మహమ్మదీయులు- బ్రిటిషువారు- స్వతంత్ర భారతీయులు -క్రీస్తు పూర్వంనుంచీ ఇప్పటిదాక వరుసగా ఆంధ్ర ప్రదేశముపైన పెత్తనం సాగిస్తూ వచ్చినవాళ్లు. అల్లాగే ఆర్షం- బౌద్ధం- జైనం- వైదికం- శైవం- వైష్ణవం- మాధ్వం అనే మతాలు ప్రాబల్యం-

వ్యాప్తి భిన్న కాలాలలో ఆంధ్ర ప్రాంతాన నెరపుతూ వచ్చి నట్లు తెలియగలం.

మన ప్రాంతానికీ, మన జాతికీ, మనభాషకూ ఉన్న పేర్లనుగూర్చి విచారంచేసిన పండితులు చాలమంది ఉన్నారు. పరిశోధనల్ని సల్పిన చరిత్రకారులున్నారు. ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రజాతినిగూర్చి ఉల్లేఖింపబడిన సందర్భం చూస్తే- విశ్వామిత్రి సంతతిలో ఆతని ఆజ్ఞను మీరి చరిం చినవా ళ్ళేభై మంది ఉన్నారనీ, వారిని విశ్వామిత్రుడు శపించాడనీ ఆంధ్రులు- పుండ్రులు- శబరులు- పుళిందులు- మూతిబులుగా వాళ్ళు ప్రవర్తిలుతూ వచ్చారనీ తెలుస్తుంది. ఏమైనా ఆంధ్రజాతీయులు శప్తులన్నమాట యదార్థమే నేమో అనిపిస్తుంది. ఏమంటే ఇప్పటికీ మనకు అదృష్టం అల్లంత దూరంలోనే నిల్చిపోతూ ఉంటోంది. ఒక రాజకీయాల్లో అనే ఏమిటి ? అన్నిరంగాలల్లోను వర్గాలు ఏర్పడి మనలో మనకు సామరస్యం కుదరకుండా ఏదో శాపమున్నట్లే వివదించు కుంటూ అజ్ఞత ఆవరించిన వాళ్ళముగా ప్రవర్తిలుతూనే ఉంటున్నాము. వ్యాస భారతంలోను, వాల్మీకి రామాయణం లోను, మత్స్య వాయు పురాణల్లోను ఆంధ్రజాతి ప్రసక్తి కన్పిస్తూన్నది. అశోకుడు వేయించిన శాసనంలోనూ, ప్లినీ అనే విదేశీయ చరిత్రకారుని వ్రాతల్లోను ఆంధ్రశబ్దం అగు పిస్తూన్నది. జాతి వాచకంగా ప్రాచీన కాలంనుంచీ 'ఆంధ్ర' శబ్దం వాడుకలో ఉన్నట్లు స్పష్టం. అటు తర్వాత దేశ పరంగాను, భాషాపరంగాను ఈశబ్దం వాడుకలోకి వచ్చినట్లు కనుగొంటాము.

అట్లాగే తెలుగు - తెనుగు అనే పదాలు జాతి దేశ భాషాపరాలుగా తరువాత కాలాన ప్రచారంలోని కొచ్చాయి. త్రిలింగ దేశమనే వ్యవహారము కొంతకాలము మన ప్రాంతాని కున్నట్లు తెలుస్తుంది. విద్యానాథుడు పేర్కొన్నట్టుగా మూడు శివక్షేత్రముల మధ్యప్రదేశము ఇది. దాక్షారామము, శ్రీశైలము, శ్రీకాళహస్తీశులు మనకు సుప్రసిద్ధమయిన త్రిలింగాలు. దక్షిణభాషఅనీ (తెన్ - అగు) తేటయినదనీ తెనుగుకు కొందరు వ్యుత్పత్తిచెపుతూ వచ్చారు.

శ్రీనాథుడి కాలంలో మన భాషకు 'కర్ణాట భాష' అనే వ్యవహారం ఉన్నట్లు గ్రహిస్తాము. చెవుల కింపైనది యీ కర్ణాట మని పండితులు వ్యుత్పత్తి చెప్పారు. ఆంధ్ర- తెనుఁగు - తెలుఁగు - అనే పేర్లు పర్యాయ పదాలుగా ఈ నాటికీ స్థిరపడి వ్యవహారంలో అగుపిస్తున్నవి. ఇంతటితో శబ్ద విచారం మానేసి, సంక్షేపంగా మన చరిత్రను గూర్చి ముచ్చటిస్తాను.

## సాతవాహనులు

మనకు తెలిసినంతవరకు రెండువేల సంవత్సరాల పూర్వం సాతవాహనులు మన ప్రాంతాన్ని ఏలారు. తెలంగాణా, రాయలసీమ, సాగరాంధ్ర జిల్లాలు అప్పట్లో వారి ఏలుబడిలో కలసే ఉన్నాయి. సాతవాహనుల్ని శాలివాహనులని కూడ పిలిచినట్లు తెలుస్తుంది. వీళ్ళతో ఏర్పడిందే శాలివాహన శకమన్నది. దాదాపు 450 సంవత్సరాలు వీళ్ళు రాజ్యం చేశారు. వీళ్ళలో శ్రీముఖుడు మొదట (క్రీ. పూ. 220) శ్రీకాకుళాన్ని (కృష్ణాజిల్లా) తర్వాత ధాన్యకట

కాన్నీ (ధరణికోట) అటుతర్వాత కళింగ, మగధ రాజ్యాల్నీ జయించి పాటలీపుత్రాన్నీ రాజధానులుగా గొప్ప కీర్తి వైభవాలతో రాజ్యాన్ని పరిపాలించాడు. సాతవాహన రాజులలో "కర్ణి" రాజు లెక్కువ. వీరిని బట్టే కర్ణినాడు- కర్నాడు- కర్నాట దేశమనే పేరు వచ్చిందని చారిత్రికు లంటారు. సాతవాహనులు వైదిక మతానుయాయులు; అశ్వమేధాలు చేస్తూ వచ్చారు. ప్రాకృతం వారి రాజభాష. కళలూ విద్యలూ వీరి పోషణలో వర్ధిల్లాయి. హాలుని 'శాలివాహన (గాథా) సప్తశతి'- గుణాఢ్యుడి బృహత్కథా- జగత్ప్రసిద్ధాలైన ప్రాకృత గ్రంథాలు. సాతవాహనుల కాలాన వైదిక మతంతోపాటు బౌద్ధ మతమున్నూ వ్యాప్తి పొందింది. స్తూపాలూ, విహారాలూ, ఆంధ్ర ప్రాంతాన- అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటసాల, గుంటుపల్లి- ఇంకా ఇంకా పెక్కు చోట్లా వెలిశాయి. జగద్విఖ్యాతి చెందిన ఆచార్య నాగార్జునుడు, మహాయాన మతప్రవక్త, సాతవాహనుల కాలం వాడేనని మరువరాదు.

## ఇక్ష్వాకులు మున్నగు రాజవంశాలు

సాతవాహనులు రాను రాను బలహీనులు కావడాన అనేక స్వతంత్రులు (క్రీ. శ. 3 శతాబ్దం) చిన్న చిన్న రాజ్యాలను స్థాపించుకొన్నారు. వీరిలో ఇక్ష్వాకులు పేర్కొనదగినవారు. 50 సంవత్సరాలు వీళ్ళు రాజ్యం చేశారు. వీరూ ప్రాకృతాన్నే ఆదరించారు. ఇక్ష్వాక ప్రభువులలో విజయపురిలో వర్ధిలిన వీరపురుషదత్తు ప్రసిద్ధుడు. బౌద్ధారామాలు- విహారాలూ- చైత్యాలు నాగార్జున కొండ (శ్రీ పర్వతం) దగ్గర నిర్మించి

కళల్ని పోషించి, తర్వాత తరాల వారికి ఆంధ్ర శిల్ప సంపద నందించిన మహానుభావుడు. ఇక్ష్వాకుల కాలం లోను వైదిక బౌద్ధమతాలు సమానాదరణం పొందినై.

వీరి తర్వాత కృష్ణా గోదావరీ మధ్య దేశాన్ని బృహత్పలాయనులు బందరు ప్రాంతాన, శాలంకాయనులు ఏలూరు ప్రాంతాన రాజ్యపాలనం గావించారు. ఆ పిమ్మట దక్షిణాన ఉన్న పల్లవ రాజులు (వర్మలు) ఆంధ్రను పాలింపసాగారు. తదనంతరం విష్ణుకుండినుల ఏలుబడిలో 150 ఏళ్ళు వేదమతం, శైవము వైష్ణవమూ సమానంగా వృద్ధిపొందినై. బౌద్ధం క్షీణించింది. దెందులూరు రాజధాని; ఈ రాజులలో మాధవ వర్మ ప్రసిద్ధుడు. శ్రీశైలక్షేత్ర ప్రశస్తి హెచ్చిన కాలమిది. సంస్కృత భాషాదరమూ అభివృద్ధి చెందిందీకాలాన.

## తూర్పు చాళుక్యులు (634–1076)

ఇంక తర్వాత వాతాపీ బాదమీలకు చెందిన చాళుక్యుల (క్రీ. శ. 7వ శతాబ్దాది) అధీనంలోకి ఆంధ్ర దేశంవచ్చింది. వీరిలో పులకేశి పరాక్రమశాలియై తాను జయించిన వేంగీ దేశాన్ని తనతమ్ముడు కుబ్జ విష్ణువర్ధనునికి ధారాదత్తం చేశాడు. తర్వాత ఇతడు స్వతంత్రుడైనాడు. ఈతని వంశం వాళ్ళే వేంగీచాళుక్యులు. చాలా కాలం రాష్ట్రకూటులకూ చాళుక్యులకూ యుద్ధాలు జరిగాయి. వేంగీచాళుక్యులలో విష్ణువర్ధనులు, విజయాదిత్యులు పెక్కురు. వీరిలో మూడవ విజయాదిత్యుడు ప్రసిద్ధి పొందిన రాజు. దక్షిణాన పల్లవులకు రాష్ట్రకూటులకు, పశ్చిమ చాళుక్యులకు చోళులకూ ఎప్పుడూ

కలహాలే. అందుచేతనే చోళరాజ్యం వేంగీరాజ్యం సుస్థిరంగా ఉండడానికి చోళ తూర్పుచాళుక్యుల మైత్రీ సంబంధాలు ఏర్పడిన వని అనాలి. విమలాదిత్యుడు చేసుకున్న కుందవాంబ చోళరాజుసోదరి. వీరి కుమారుడే మన రాజరాజనరేంద్రుడు. ఈతడి భార్య అమ్మంగదేవి కూడా చోళనృపతికుమార్తె! సంస్కృత భారతాన్ని తెలుగులోకి తన ఆస్థానకవియైన నన్నయభట్టు చేత అనువదింప జేసిన నరేంద్రుడు ఈ రాజరాజే. క్రీ. శ. 1022 లో ఈతడు పట్టాభిషిక్తుడైనాడు. వైదిక మతోద్ధారకుడైనాడు. ఆ మధ్య వ్యాప్తిపొందిన జైనమతాన్ని వెనుకబట్టించినాడు. తెనుగుభాష రాజగౌరవం పొందినకాల మది. చాళుక్యరాజులు "దేశికవిత బుట్టించి యంధ్రవిషయమున తెలుగును నిలిపినకీర్తి" దక్కించుకొన్నారు.

రాజరాజుకుమారుడు చోళ చాళుక్యరాజ్యాల రెంటికీ ప్రభుత నెరపగల్గాడు; ఈతడు రాజధానిని క్రమంగా అరవదేశానికి మార్చడంవల్ల ఆంధ్రప్రదేశాన ప్రతినిధుల రాజ్యం ఏర్పడింది. అలా చాళుక్యచోళుల ప్రాతినిధ్యం నెరపినవారిలో శైవులు వెలనాటి చోళులు పేరు మోశారు. వీళ్ళు చందవోలు (గుంటూరుజిల్లా) రాజధానిగా చేసుకొని పాలించారు. గొంకరాజు వీరిలో ప్రసిద్ధుడు. తరువాత క్రమంగా వీళ్ళు పశ్చిమ చాళుక్యులకు లొంగిపోయి వారికి సామంతులైనా, మళ్ళీ స్వతంత్రులైనారు. ఈకాలానికిచెందినవాడే మల్లికార్జునుడు. రామానుజ మతమును వ్యాప్తిపొందుతూ వచ్చిందొకప్రక్క.

## కాకతీయులు (12, 13 శతాబ్దాలు)

అనంతరం కొంతకాలానికి కాకతీయ మహారాజు గణపతి దేవుడు ఓరుగల్లు (వరంగల్లు) నుంచివచ్చి జయించి వీరి నందరినీ లోగొన్నాడు. ఈతడు 1199–1261 వరకు రాజ్యం చేశాడు. తెలుగువాళ్ళ నందరినీ ఒక్క బావుటాక్రింద బ్రతుకనిచ్చాడు. అటు కళింగాన్ని ఇటుకాంచీని కలుపుకున్నాడు. ఉత్తరదేశాన ఘోరీ దండయాత్రలు సాగిన కాలమది. జాయపసేనాని, 'నృత్త రత్నావళి' వ్రాసిన దీకాలానే. పాల్కురికి సోమన ద్విపద కావ్యాలద్వారా వీరశైవాన్ని ప్రబోధించిన కాలమిది. మనుమసిద్ధి అనే తెనుగు చోళ భూపతికి నెల్లూరులో మంత్రిగా తిక్కన సోమయాజి వర్ధిల్లిన కాలమున్నూ ఇదే. వీరశైవం విజృంభించిన కాలము. జాను తెనుగు ప్రచారం పొందినకాలం. కాకతీయులలో గణపతి దేవునికి మొగపిల్లలు లేకపోవడాన ఆతని కుమార్తె రుద్రమదేవి రాజ్యానికి వచ్చింది. అరివీర భయంకరంగా పద్మవెలమ నాయకుల తోడ్పాటుతో రాజ్యమేలింది. ఆమెకున్నూ మొగపిల్లలు లేరు. అంచేత ఆమె తన మనుమణ్ణి ప్రతాపరుద్రుని పెంచుకొని అతనికి (1294) రాజ్యాన్నిచ్చింది. ఇతడున్నూ పరాక్రమశాలి. ఎత్తివచ్చిన ఢిల్లీ సుల్తానుల నెదుర్కొన్నాడెన్నోసార్లు. చిట్టచివరికి పట్టుబడి ఆత్మ త్యాగం చేసుకొన్నాడు. విద్యానాథుడు అనే ప్రసిద్ధ పండితుడీకాలం వాడే. చూశారా, ఇలా ఆంధ్రప్రాంతం (1323లో) ముస్లిముల పాలనకు గురిఅయింది.

మూడు ప్రాంతాలుగా చీలింది.

అయితే యది ఆట్టేకాలం సాగనీయకుండా సామంతులూ నాయకులూ ఒక్కటై ఓరుగల్లును స్వాధీనం చేసుకొన్నారు. వీరిలో ప్రోలయ నాయకుడు కాపయనాయకులు పేర్కొనదగినవారు. మరొక ప్రక్కన విజయనగరం (హంపీ విరూపాక్షుని సమీపాన) రాజధానిగా (1336) హరిహర బుక్క రాయలు పాలింప సాగారు. విద్యారణ్యస్వామి యీకాలానికి చెందిన మహా పురుషుడు. కొద్దికాలానికే గుల్బర్గా రాజధానిగా బహమనీరాజ్యం ఏర్పరుచుకొన్నారు అక్కడి సర్దార్లు. (అల్లాయుద్దీన్ హసన్ గంగు) బహమనీసుల్తాను ఘోరెక్కువైంది. తెలుగు నాయకులు తమలో తాము కలహించు కోవడం చూచి అద్దంకి సామంతుడైన ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రుడై సాగరాంధ్రాన్ని ఏలసాగాడు. తెలంగాణాను రాచకొండ రాజధానిగా రేచర్ల వారు ఏలసాగారు. విజయ నగరం అన్యరాజన్యుల ఏలుబడిలో ఉండిపోయింది. ఇలా మూడు ప్రాంతాలుగా చీలింది ఆంధ్రం.

రెడ్డిరాజులు

విజయనగరం రాజుల దాడులవల్ల అద్దంకినుంచి రెడ్డిరాజుల రాజధాని కొండవీటికి మార్చబడింది. అనంతరం వీరి రాజ్యం తూర్పునకు సింహాచలందాకా బాగా విస్తరించింది. కాటయ వేమారెడ్డి రాజమహేంద్రవరములోని రెడ్డిరాజ్యానికి కారణ భూతుడై రాజైనాడు. పెదకోమటి వేమారెడ్డి కొండవీడులో ఉండేవాడు. తర్వాత కొండవీటి రెడ్డిరాజ్యం అస్తమించ

డానికి అంతః-కలహాలే కారణాలైనాయి; అక్కడ కాటయ వేమారెడ్డి తరువాత రాజమహేంద్రవరం అల్లాడరెడ్డిద్వారా వీరభద్రారెడ్డికి సంక్రమించింది. రెడ్డిరాజు లనేకులు తాము పండితులై తెలుగు కవిత్వాన్ని నాట్యాన్ని సంగీతాన్ని బాగా పోషించి కీర్తి చెందారు. సుప్రసిద్ధులైన ఎఱ్ఱాప్రెగ్గడ, కవి సార్వభౌముడు శ్రీనాథుడూ రెడ్డి మహీశుల పోషణలో వర్ధిల్లిన మహాపురుషులు. భక్తపోతన ఆకాలంవాడే. విద్వద్గోష్ఠులు, కనకాభిషేకాలు వసంతోత్సవాలు నేత్రపర్వంగా జరిగిన కాలమది. నాటి వర్తకవ్యాపారాలకు వీరానికి వినోదానికి ఆంధ్రదేశం పేరు మోసింది!

## విజయనగరరాజులు

తెలంగాణాలో ఏర్పడ్డ బహమనీ రాజ్యం, ఓరుగంటి రాజ్యాన్ని రేచర్లవారి రాచకొండ రాజ్యాన్ని కబళించి విస్తరించింది. విజయనగర రాజ్యమే కొంత ఆశారేఖగా ఆంధ్రులకు నిలిచినట్టైంది. చితికిపోయిన కొండవీటి రాజ్యాన్ని విజయనగరం రాజు లాక్రమించారు. దేవరాయల కాలంలో దక్షిణా పథమంతా తెలుగుజండా క్రిందికి వచ్చింది. అయితే బహమనీ సుల్తానుకూ విజయనగరం రాజులకూ ఎప్పుడూ పోరాటమే. అట్లాగే ఉత్తరాన కళింగాధిపతికీ గజపతులకూ ఎప్పుడూ యుద్ధాలే. గజపతుల అధీనంలోకి దక్షిణాన ఉదయగిరిదాకా ఆంధ్రప్రాంతం వెళ్ళింది. విజయనగరాధిపులలో సాళువ నృసింహరాయ లెన్నదగిన వీరుడు. ఆతర్వాత తుళువ నరస నాయకుడు రక్షకుడనాలి. ఈ నరసానాయకుని కుమారుని మంత్రి ప్రసిద్ధి వడసిన తిమ్మరుసు.

క్రమంగా బహ్మనీ సుల్తానులు బలహీనులుకాగా వారి క్రిందవున్నవారు స్వతంత్రులై బీజాపూర్ - గోల్కొండ - అహమ్మదునగర్ - బీరార్ - బీదరు లను వేరువేరు రాజ్యాలను ఏర్పరుచుకొని పాలింపసాగారు. వీళ్ళు రాజ్యవిస్తరణ కాంక్ష కలవారై నిరంతరం పోరాటాలు చేస్తూ వచ్చారు. తిమ్మరసు కృష్ణదేవరాయల్ని (1510) విజయనగరాధిపుణ్ణి చేసి, అటు గజపతులను ఇటు సుల్తానులను తరిమివేసి ఆంధ్ర ప్రాంతాన్ని రక్షించిన వాడైనాడు. కృష్ణరాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముడనే కీర్తిని వహించి ఆంధ్రదేశ చరిత్రలో, సాహిత్య చరిత్రలో, స్వర్ణయుగాన్ని స్థాపించిన మహనీయుడు. పరాక్రమశాలి; విద్వత్కవి చక్రవర్తి. అల్లసాని పెద్దనాది అష్టకవి దిగ్గజములను పోషించిన 'ఆంధ్ర భోజుడు'.

కృష్ణరాయల అల్లుడు (ఆర్వీటి) అళియ రామరాయల కాలాన (1565) బహమనీసుల్తానులు అయిదుగురేకమై రాక్షస తగ్గి దగ్గర ఘోరపోరాటం సల్పారు. రామరాయల్ని అందులో చంపివేశారు. విజయనగరాన్ని ధ్వంసంచేశారు.

## దక్షిణాంధ్ర నాయకులు

అనంతరం ఆర్వీటిరాజులు పెనుగొండను - చంద్రగిరిని రాయవెల్లూరును రాజధానులుగా కాలక్షేపంచేస్తూవచ్చారు. అంతఃకలహాలలో ఇవన్నీ ఛిన్నా భిన్నమయినవి. తంజావూరు, మధురలలో వర్ధిలుతూవచ్చిన నాయకరాజులున్ను తుదకు అంతఃకలహాలతో అంతరించిపోయినారు. మహారాష్ట్రుల వశమైనతర్వాత, వీళ్లలో తంజావూరు రఘునాథనాయకుడు

ప్రసిద్ధుడు. కృష్ణరాయలవంటివాడు: స్వయంకవి. కళాపోషకు డున్నూ. యక్షగానం, సంగీత సాహిత్యాలు వృద్ధిపొందిన కాల మది. ఈయుగాన్నే త్యాగరాజు, క్షేత్రయలు వర్ధిల్లారు. అప్పటికి పోర్చుగీసువారు, ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు వర్తక వాణిజ్యాల పేరుచెప్పుకొని క్రమంగా వారు ఆక్రమించుకొని పోవడానికి ఒకప్రక్కన యత్నిస్తూ వస్తున్నారు.

## ముస్లింపాలన

ముస్లింప్రభుత్వం ప్రశస్తిచెందుతూ వచ్చింది. మన జిల్లాలు గోల్కొండనవాబుక్రిందికి వెళ్ళినాయి. గోల్కొండ రాజ్యమనే పేరేగాని తెలుగుభాష ముస్లింప్రభువుల పోష ణలో గౌరవాన్ని పెంపునూపొందింది. అద్దంకి గంగాధరకవీ, పొన్నికంటి తెలంగినార్యుడూ ఈకాలాన వర్ధిలిన కవిశేఖరులే.

తరువాత కొంతకాలం ఢిల్లీపాదుషాల ఏలుబడిలోఉండి మనప్రాంతం 1724 నుంచి విమోచనం పొందింది. హైదరా బాదు రాజధానిగా అసఫ్జా వంశీయుడైన నిజాముల్ముల్కు పాలనలోకి వచ్చింది. ఈతని తర్వాత ఈతని సంతతివారిలో కలిగిన కలహాల కారణంగా ఫ్రెంచివారికి బ్రిటిషువారికి తమ తమప్రభలు వెలగడానికి అవకాశం చిక్కింది. ఆయానవాబుల పక్షం వహించి సాహాత్తు యుద్ధాలలో వీళ్ళు సహాయంచేస్తూ పలుకుబడిని సంపాదించారు. బొబ్బిలియుద్ధం కారణంగా ఫ్రెంచివారి అధీనంలోకి సర్కారుజిల్లాలు వెళ్ళినై. ఆతర్వాత ఇంగ్లీషువారు జయించుకొని గడించారు. అటుపిమ్మట మైసూరురాజ్యాన్ని గడించిపెట్టడంలో టిప్పుసుల్తాను నుంచి

(1799) నిజాంకు సాయంచేసినందుకు ఇంగ్లీషువారు రాయల సీమ జిల్లాలను వారియించుకొన్నారు.

## బ్రిటీషువారు

ఇట్లా ప్రవేశించిన ఈస్టిండియా కంపెనీవారు క్రమంగా 1857 నాటికి ఇంగ్లండులోని విక్టోరియా రాణి ప్రభుత్వంక్రిందికి యావద్భారతాన్ని తెచ్చినవారై, 1946 వరకూ పరిపాలన సాగించారు. సెక్రిటరీ ఆఫ్ స్టేటు ఫర్ ఇండియా ద్వారా- గవర్నరుజనరల్ ద్వారా- గవర్నర్ల ద్వారా- ఉన్నతోద్యోగుల ద్వారా - ఆంగ్లవిద్యాబోధద్వారా - బిరుదప్రదానం చేతా ఎలా మనల్ని బానిసలనుగాచేసి బ్రిటిషువారు ఏలారో మరువలేము.

## దేశస్వాతంత్రోద్యమం - తత్సిద్ధి

విదేశీయుల పరిపాలనం దేశీయుల నణచివేయడంలో గడితేరింది. విభజించి పాలించడం వారి విధానమైంది. దయా సానుభూతులు కొరవడి దాష్ట్యం- దౌర్జన్యం- దంభం- నిరంకుశత్వం అన్నవిప్రబలిపోతూ రావడం దేశీయులకు సహింప రానిదైంది. కాంగ్రెసుసంస్థ, గాంధీ నాయకత్వం ప్రజలపాలిటి శరణ్యమై ఆదుకొనసాగినవి. స్వాతంత్ర్యకాంక్ష - దీక్షలు క్రమంగా ప్రబలి వ్యాప్తమైనవి. అసంఖ్యాకంగా దేశభక్తులు గాంధ్యనుయాయులు ఆత్మశుద్ధితో అమితోత్సాహంతో ప్రబోధ ప్రచారాలకు పూనుకొన్నారు. లాఠీదెబ్బల్ని, కాల్పుల్ని కారాగారవాస క్లేశాన్ని ధైర్యసాహసాలతో ఓర్చారు. ఆంధ్రప్రాంతానా కాంగ్రెసు పటిష్ఠమై అనేక దేశ

భక్తుల్నీ త్యాగశీలుర్నీ సంపాదించుకోగల్గింది. స్వాతంత్ర్య సమరం మంచి పట్టుదలతో కాంగ్రెసు అధ్వర్యాన జరుగుతూ వచ్చింది. ఆంగ్ల సామ్రాజ్యవాదాన్ని ప్రజలుబాగా ఎదు ర్కొనసాగారు. పరిపాలనకు అడుగడుగునా ఆటంకాలు కల్పిస్తూవచ్చారు. విద్యార్థులు-ఉద్యోగులు-రైతులు-స్త్రీలు ఒకరని ఏమిటి? అందరూ సత్యాగ్రహాన్ని అమలుపరుస్తూ తీవ్రఆందోళనాన్ని కల్గిస్తూ స్వాతంత్రోద్యమాన్ని పటిష్ఠం చేయసాగారు.

విదేశవస్తు వస్త్ర బహిష్కారంద్వారా - ఖద్దరు ధారణంద్వారా -1921లో అసహాయోద్యముద్వారా- పన్నుల నిరాకరణోద్యముద్వారా- 1930లో ఉప్పు సత్యా గ్రహముద్వారా - నాటి ప్రభుత్వంపైన ఒత్తిడితెచ్చారు. 1935 లో ఇండియాఆక్టు ఏర్పడడం- 1937లో కొన్ని రాష్ట్రా లలో శాసనసభల ఎన్నికలలో అధికసంఖ్యాక బలంతో వచ్చి కాంగ్రెసు మంత్రివర్గాలను సమ్మతించీ - మళ్ళీ రెండవ ప్రపంచయుద్ధంలో భా ర త దే శ ం తో సంప్రతించకుండా యోధదేశంగా మన దేశాన్ని ప్రకటించినందుకు అసమ్మతిసూచ కంగా మంత్రివర్గాలు రాజీనామాయిచ్చి ఎలా కాంగ్రెసు గాంధీగారి నాయకత్వాన స్వాతంత్ర్యసమరంలో వివిధదశల్ని అహింసాయుతంగా అతిక్రమిస్తూ పాటుబడిందో, ఎందరెందరు భారతీయులు ధన, మాన, ప్రాణాల్ని బలియిచ్చారో తలుచు కుంటే వళ్ళు జలదరిస్తుంది.

1939-45లమధ్య రెండవ ప్రపంచయుద్ధం జరిగింది. భారతీయులు ఆంగ్లప్రభుత్వానికి అందులో సహాయంచేయలేదు.

క్రిప్సురాయబారం అంతశ్శుద్ధిలేనిది కావడాన ఫలించలేదు. బ్రిటిషువారు భీష్మించుకొని ఉండడం దేశీయుల్ని రెచ్చగొట్టింది; ప్రజలు సహనం పూర్తిగా గోల్పోయినారు. బొంబాయినుంచి గాంధీఆజ్ఞ ప్రజలకు అందింది. 1942 అగష్టు 8వ తేదీన 'క్విట్టిండియా' ఉద్యమం ఆరంభమైంది. ప్రజావిప్లవం విజృంభించింది. నాయకులంతా అరెస్టైనారు. నాటిప్రభుత్వం దారుణ దమన విధానంచేత ప్రజల్ని అణచివేసింది. 1954లో రాజీపడుదామన్న బ్రిటిషుప్రభుత్వపు ఆశయం – సిమ్లాసమావేశంలో విఫలమైంది. ఇలాఉండగా నేతాజీబోసు ఏర్పరచిన– జగత్తుకు విభ్రాంతిచేకూర్చిన– ఆజాద్‌హింద్ ఫౌజు I. N. A. విచారణకువచ్చింది. బ్రిటిషుప్రభుత్వం ప్రజలకు భయపడి వారిని విడుదలచేసింది.

ఆతర్వాత బ్రిటనులో ఎన్నికలువచ్చినవి. లేబరుపార్టీ గెలిచింది. 1946లో పెథిక్‌లారెన్సు నాయకత్వాన రాయబారవర్గంరావడం, అటుతర్వాత ముస్లింలీగ్ విపరీతచర్యలు, నెహూ్రు ఉపాధ్యక్షతక్రింద ప్రభుత్వకార్యవర్గంఏర్పడడం – నవకాళీ దురంతాలు– వేవెల్ ఉద్వాసన– మౌంట్‌బాటన్ దేశవిభజనపథకం – తప్పనిసరిఅయి అందుకు నాయకుల అంగీకారముల ఫలితముగా 1947 ఆగష్టు 14వ తేదీ రాత్రి రెండుజాములకు దేశ స్వాతంత్ర్యసిద్ధి మనచరిత్రలో మరువరాని అంశాలు.

## రాష్ట్రోద్యమం

అలాగే ఆంధ్ర రాష్ట్రోద్యమము ఎలా 1913 బాపట్లలో ప్రారంభమై సాగిందో – జొన్నవిత్తుల గురునాథం, కొండా

వెంకటప్పయ్య, ఆంధ్రరత్న వున్నవ లక్ష్మీనారాయణ, పట్టాభి సీతారామయ్య—ప్రకాశం—స్వామీసీతారాం—మున్నగు ఆంధ్ర నాయకులు ఎలా తీవ్రంగా కృషిచేశారో, గుంటూరు సాహిత్య సమితి ద్వారా, ఆంధ్రమహాసభ ద్వారా ఎందరెందరెంతగా ప్రబోధ ప్రచారాలుచేశారో అవన్నీ చరిత్రగతమై పోయినై.

విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు బొంబాయిలో 1908 లో ఆంధ్ర వారపత్రికను ప్రారంభించీ, తర్వాత మద్రాసు కేంద్రంగా దాన్ని దినపత్రికనుచేసి గొప్ప దోహదం ఆంధ్రోద్యమానికి కల్పించడం—బందరులో ఆంధ్ర జాతీయ కళాశాలా కృష్ణాపత్రిక లేర్పడడం- 1900 లో విజ్ఞాన చంద్రికాగ్రంథ మండలినీ, 1901 లో హైదాబాదులో శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయాన్ని, 1912 లో ఆంధ్ర విజ్ఞాన సరస్వ ప్రచురణమునూ కొమర్రాజు లక్ష్మణరావు పంతులు ఆరంభించడం — 1922 లో హైదరాబాదులో ఆంధ్ర భీష్మ మాడపాటి హనుమంతరావు పంతులు, మేధా సంపన్నులు బూర్గుల రామకృష్ణరావు, కొండా వేంకటరెడ్డి ప్రభృతులతో ఆంధ్ర జనసంఘం ఏర్పడడం — గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారి గ్రంథాలయోద్యమ నిర్వహణమూ— 1923 లో ఆంధ్ర బ్యాంకుస్థాపనము—ఆంధ్ర ఇన్స్యూరెన్సుకంపెనీ నిమిత్తంగా చెరుకువాడ నరసింహంపంతులవారి గంభీర ప్రబోధము—1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనము— 1927 లో ఆంధ్ర నాటక కళాపరిషత్ స్థాపన—1928 లో ఆంధ్ర వాణిజ్యమండలి ఏర్పాటు—1925 లోనే ప్రారంభమైన సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన గోల్కొండ.

(అర్ధవార) పత్రికా నిర్వహణము—సుజాత (1927) పత్రికా, తెలంగాణా—అడివి బాపిరాజుగారి సంపాదకత్వాన మీజాన్ (1945–47) లనే దినపత్రికలూ—నిజాం కళాశాల ఆంధ్ర సారస్వత సమితి : సరిపల్లి, కురుగంటివార్ల ప్రబోధమూ-జమ్‌షెడ్‌పూరు ఇత్యాది స్థలాలలో రాష్ట్రేతరాంధ్రుల కృషీ—గుంటూరు హిందూకళాశాల ఆరంభించి సాగిస్తూవస్తున్న ఆంధ్రాభ్యుదయోత్సవాలు—ఆంధ్రప్రభ, జన్మభూమి, ప్రజాశక్తి, విశాలాంధ్ర లనే దినపత్రికలు చేసిన అఖండ ప్రబోధమూ—రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి, తుమ్మల మున్నగుకవీంద్రుల కావ్యాలూ—అనేకపండితుల ఉపన్యాసాలూ – పప్పూరి రామాచార్యులు, కల్లూరి సుబ్బారావు, నీలం సంజీవరెడ్డి ప్రభుతులకృషి అద్భుతమైన సంచలనాన్ని నలుమూలలా కల్గించినై; రాష్ట్రోద్యమానికి ఎంతగానో సహాయపడినై.

రాయలసీమ నాయకులూ సర్కారు నాయకులూ చేసుకున్న (14–11–1937) "శ్రీబాగ్ ఒడంబడికా"–ఆంధ్ర మహాసభ యేటేటా రాష్ట్రనిర్మాణంగూర్చి చేస్తూవచ్చిన తీర్మానాలూ— స్వరాజ్యసమస్య ప్రథమసమస్య కావడాన విలంబం జరగడమూ—అనంతరం 'థార్ కమీషను' వచ్చి ఆంధ్ర రాష్ట్రం స్వయంపోషకం కాదని అనడమూ—1948 సెప్టెంబరు 13 న హైదాబాదుపై పోలీసుచర్య తర్వాత 1948 లో పట్టాభి సీతారామయ్యగారి అధ్వర్యాన జయపూర్‌లో జరిగిన కాంగ్రెసు కోరిన 'జె. వి. పి రిపోర్టు' ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖత్వం చూపడమూ—మద్రాసు ప్రభుత్వం విభజన

సంఘం ఏర్పాటు చేయడమూ—మద్రాసుపట్నం విషయంలో ప్రకాశంగారి ప్రస్తావనలా, తమిళనాయకుల పేచీవల్ల 1950లో వెనక్కి వెళ్లడం—జనరల్ ఎన్నికల సందర్భాన రాష్ట్రసమస్య ప్రాధాన్యం వహించడం—అనంతరం మందకొడిగా ఉన్న ఆంధ్ర ప్రజలలో, స్వామిసీతారాం 15-8-1952 న గుంటూరులో నిరశనవ్రతం ఆరంభించి 35 రోజులు, తీవ్ర సంచలనాన్ని కల్గజేయడం—మనచరిత్రలో గుర్తించాల్సిన అంశాలు.

చిట్టచివరకు గాంధీగారి శిష్యుడు నిరాడంబరజీవి పొట్టి శ్రీరాములు మద్రాసులో ఘోర నిరశనవ్రతంపూని 58 దినముల అనంతరం అసువుల్ని త్యాగంచేసి (15-12-52) ఆంధ్ర రాష్ట్రాన్ని అక్టోబరు 1953 నాడు సిద్ధింపజేసిన—సంగతి జనులెవ్వరూ మరువజాలని అద్భుత సన్నివేశం!

తర్వాత టెన్నేటివిశ్వనాథం, నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్నగారలు విభజనసంఘంలో ఉండి మహామేధావీ కార్యశూరుడూ అయిన శ్రీ త్రివేదికి అనితరంగా సహాయపడిన విషయం ఉల్లేఖించుకోవాలి.

ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా, శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీ గవర్నరుగా, కర్నూలు రాజధానిగా, ఆంధ్రప్రభుత్వం ఏర్పడింది. పదమూడు నెలలుమాత్రమే ఇది నిలిచింది. తర్వాత రాష్ట్రపతి పాలన—ఎన్నికలు! గోపాలరెడ్డి గారు ముఖ్యమంత్రిగా తిరిగి ఆంధ్ర మంత్రివర్గం ఏర్పడి రాష్ట్రరథం సాగుతోంది.

## విశాలాంధ్రోద్యమం

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిందంటే రాయలసీమ సాగ రాంధ్రాలు కలిసినవికాని, తెలంగాణా కలవకండా హైదాబాదు రాష్ట్రంలో ఉండడం ఏటిన్యాయం? ఆంధ్ర కమ్యూనిష్టుపార్టీ మొదటినుంచి తీవ్రంగా ఆందోళనసలుపుతూవచ్చింది. అయ్యదేవర కాళేశ్వరరావు నాయకత్వాన విశాలాంధ్ర ఉద్యమం సాగుతూనే వచ్చింది. ఆంధ్రసారస్వత పరిషత్తూ దాశరథికవీ చేసిన ప్రచారాన్ని మరువలేము. ముఖ్యమంత్రి శ్రీ బూర్గులవారి కృషి మెచ్చతగింది. దురదృష్టవశాత్తు కొద్దికాలం తెలంగాణా నాయకులు కొద్దిమంది 'ప్రత్యేక తెలంగాణా' కావాలని పట్టుబట్టినారు. భారతప్రధాని నెహ్రూగారి ధర్మమాఅని కమ్ముకొన్న మేఘాలు విచ్చిపోయి ప్రశాంత వాతావరణం ఏర్పడింది. తెలంగాణా జిల్లాలున్న ఆంధ్రలోచేరి "ఆంధ్రప్రదేశ" మంటూ ఏర్పడబోతూ ఉండడం శుభావహమైనా, సంతోష ప్రదమైనా సంగతి!

## ఆంధ్రప్రదేశావిర్భావం—నివాళి

అదిగో వస్తూన్నది. అక్టోబరు ఒకటి! ఆంధ్రులమైన మనకందరికీ మహాపర్వదినం. తెలుగు సోదరీ సోదరులంతా కలసి ఐక్యకంఠంతో భారతమాతను కీర్తిస్తూ నివాళులెత్తే శుభముహూర్తం అదిగో!

మనభాగ్యం పండింది! పదండి పదండి భాగ్య నగరానికి!! తెలుగు భాషామతల్లి తీయని తేనెవాకలో ఆనంద

తరంగిత హృదయాలతో ఓలలాడుదాం! అలా పవిత్రీభూత చేతస్కులమై భారతాంబకు భక్తితో సేవ జేయటానికి దీక్షా కంకణాలను ధరిద్దాము! పదండి! పదండి!! భాగ్యనగరానికి!!!

[ మనచరిత్ర జ్ఞానాన్ని చేకూర్చిన ఆంధ్రచరిత్ర పరిశోధకులందరికీ-ముఖ్యంగా ఆప్తులు మల్లంపల్లివారికీ కృతజ్ఞుణ్ణి.]



# "అమృతమ్ గమయ"

మనము పూర్వము చాలా పుణ్యముచేసికొంటిమి. దాని ఫలితమే యీ మన మానవజన్మము. సృష్టిలో మనమే కాక ఇతర వస్తువు లెన్నో ఉన్నవిగదా! వాని యన్నిటికన్న మిన్నగా మానవుడు నిలుచున్నాడు. ఈ యున్నతి మానవునకు మనస్సునుబట్టి, హృదయమునుబట్టి వచ్చినది. ఆలోచనాశక్తి మనసున కున్నది; భావానుభవగుణము హృదయమున కున్నది. నిశితమైన మనస్సు, ఆర్ద్రమైన హృదయము కలిగిన మానవుడే ఉత్తముడై లోకకల్యాణమునకు తోడ్పడగలడు.

ఇట్లు మానవుడు తన జన్మమును సార్థకముచేసికొనుటకు జ్ఞానమవసరము. జ్ఞానము విద్యాభ్యాసము చేసిన కలుగును. విద్యను నేర్చుకొనవలెనని శిక్ష నియమబద్ధమైనది కావలెను. విద్యాలయములు పవిత్రమైన దేవాలయములే, ఆ యావరణమునందు గురువులు సమర్థులై, ఆత్మవికాసము పొందిన ప్రేమస్వరూపులై, ఆదర్శజీవులై, యొప్పు దేవతామూర్తులే. విద్యార్థులు వినయముతో, భక్తి శ్రద్ధలతో, క్రమశిక్షణమునకు కట్టుబడినవారై జ్ఞానము నార్జించుట ధర్మము. అట్టిచో పవిత్రాలయమును, ఆదర్శమూర్తులా గురువులను సమకూర్చువారి నెంతగా ప్రశంసింపవలెనో యూహింపుడు!

జ్ఞానమే అమృతము. దానిని జుర్రిన మృత్యుభయము లేదు. మనకు గోపాలకృష్ణుడు వేదస్వరూపమగు గోవును పిదికి గీతామృతము నిచ్చియున్నాడు. మన సాహిత్యములో నిది మేళనము పొందియే యున్నది.

మనది వ్యవసాయిక దేశము. మనకు గోవు పరమ పవిత్రమైనది. జ్ఞానమున కది చిహ్నము. భగవద్గీత భారతీయుల హృదయము. అసత్తునుండి సత్తును, తమస్సునుండి జ్యోతిర్లోకమును, మృత్యువునుండి అమృతమును పొందుటకు మానవుడు గోపాలు డిచ్చిన దివ్యామృతమును అనుదినము పానముచేయవలెను; అట్లు జన్మము సార్థకము గాంచవలెను.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్స సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతమ్ మహత్"

("కామగవి" పత్రికకు డిసెంబరు 1955లో
ఆశీఃపూర్వకముగా నే నిచ్చిన వ్యాసమునుంచి)





29.5.59

# శ్రీ పిల్లలమఱ్ఱి వారి కృతులు



| | | |
|---|---|---|
| * రాగలేఖలు | 1- 0-0 | గేయములు |
| మధుకణములు | ... | ,, |
| కళాశ్రీలు | ... | ,, |
| * వత్సల | 0- 8-0 | నాటిక |
| చిత్ర | ... | ,, |
| మాలిని | ... | ,, |
| దీపకళిక | ... | ,, |
| అంబరీష | ... | ,, |
| పద్య బాణము | ... | ,, |
| * ధూప దీపాలు | 1- 0-0 | కథలు |
| వెలుగు నీడలు | ... | ,, |
| పూల బాటలు | ... | ,, |
| * పూజా పుష్పాలు | 0-12-0 | ప్రసంగాలు-కథలు |
| * ఇష్టాగోష్ఠి | 1- 0-0 | ప్రసంగాలు |
| సాహిత్య వేదిక | ... | ,, |
| * సాహిత్య సంపద | 2- 8-0 | సహృదయ సమీక్ష |
| * సాహిత్య సమీక్ష | 1-12-0 | ఉపన్యాసాలు |
| * సాహిత్య సమాలోచనము | 3- 0-0 | వ్యాసములు |
| శారదా విలాసము | ... | ప్రసంగ వ్యాసములు |
| * మాధురీ మహిమ | 2- 0-0 | వ్యాసములు |
| * విద్యార్థి పారిజాతము | 1- 8-0 | లక్షణ గ్రంథము |
| వ్యాకరణ దీపిక | ... | వ్యాకృతి |
| కావ్యాలోకనము | ... | గ్రంథ సమీక్ష |
| రసగుళికలు | ... | పద్య వ్యాఖ్యలు |
| మహోదయులు | ... | జీవిత చిత్రాలు |
| విషజ్వాలలు | ... | నవల |
| మన సాహిత్యము | ... | చరిత్ర |

* సిద్ధముగానున్నవి.



**శ్రీ పిల్లలమఱ్ఱి : శారదాపీఠము : గుంటూరు-2**